# పండ్రెండురాజులకథలు

అను

## శ్రీకృష్ణ బోధామృతము.



యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం !!
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

(భ॰ గీత)

# పండ్రెండురాజులకథలు

అను

## శ్రీకృష్ణ బోధామృతము.



గ్రంథకర్త.

మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రి.



చంద్రయ్య అండు కో.,

పబ్లిషర్స్ అండ్ బుక్సెల్లర్స్,

రాజమండ్రి.

1943



[వెల రు 1—0—0

# విషయసూచిక.

—:0:—

# పంచేంద్రదురాజులకథలు.

## ఉపక్రమణిక.

శ్రీమదఖిలాండకోటిబ్రహ్మాండనాయకుండును, వేదవేదాంతరహస్యవేత్తయు, దేవర్షిగణవందితుడును, సకలలోకనాయకుండును, పదునాల్గుభువనంబులను కుక్షిలో బెట్టుకొన్నవాడును, శ్రీరుక్మిణీప్రియుండును సర్వజనస్తుత్యుండునునగు శ్రీకృష్ణుం డొకప్పుడు ద్వారకాపురంబున గోపికాపరివేష్టితుండై సంతోషసాగరమున నీదులాడుచుండెను. అంత నటకు పుణ్యదంపతులగు దేవకీవసుదేవు లరుదెంచి పుత్రునివలన నాదరింపబడి, తండ్రీ! అర్జునుండు మన సుభద్రను ఇంద్రప్రస్థమునకు గొంపోయినదిమొదలు నేటివరకు నామె క్షేమమించుకేనియు తెలియరాదు. నీవొకమారుపోయి వారి క్షేమముల దెలిసికొనిరమ్మన నా రమావల్లభుండు ప్రయాణమును నిశ్చయించి యొకశుభదినంబున తనభార్యలకును మిత్రులకును జెప్పి పాండవులకు సువర్ణంబరాభరణాదులు కానుకగా నొసగబుచ్చుకొని సపరివారముగ బయలుదేరి కొన్నిదినంబుల కింద్రప్రస్థనగరమ్ము జేరెను.

పాండుతనయులా పద్మనయునిరాకవిని యెదురేగి తోడ్కొనిపోయి బహువిధంబుల గౌరవించి యతడిచ్చిన కానుకలను గైకొని, వాసుదేవా! నీ యవ్యాజకృపావిశేషంబున నశేషవిపత్తులనుదాటి కుశలముగనున్నారమనివచించి యదునందనునియెదుట నానందమునమండిరి. ఇట్లుండ నొకదినంబున ఫల్గునుండు వసుదేవనందనునితో, బావా! ఇది నవవసంతము. ఇప్పట్టున యమునాతీరంబున గొంతవిహారమునల్పిన మహదానందమగునుగదాయని తన కోరికను దెల్పెను.

అంత దేవకీనందనుండు పార్థుంగాంచి, ఫల్గునా! నీ కోరికయే నా కోరిక. అట్లే పోవుదమని సపరివారముగ బయలుదేరి యమునానదీ తీరమున కేగిరి. నాటి నిశాసమయంబున సుధాంశుండు నిజశీతకిరణజాలముల సికతాతలంబులఁ బ్రసరింపజేయుచుండ, మందపవనుండు మెల్లన వీచుచుండ యమునాతరంగసంజనితకల్లోలారావము వీనులకు విందు గొల్పుచుండ నా బావమరదు లిరువురు సరససల్లాపములాడుచుండిరి. అంత నర్జునుండు, కృష్ణా! నా చిత్తంబిప్పు డతినిర్మలంబై యున్నది. చాలకాలమునుండి నీ వలన వేదాంతరహస్యంబుల నెఱుంగవలెనను కుతూహలంబుగలదు. మనుజులు సంసారసాగరము నుత్తరించి పునర్జన్మలేని మోక్షసామ్రాజ్యము నెట్లార్జింపగలరో తెలుపుమని యడిగెను. అంత గోవిందుడు, అర్జునా! నీ మాటలు వింతగనున్నవి. పూర్వము మన మిరువురము నరనారాయణులమగుటచేతనే నేడు నీవు వేదాంతము నెఱుగ కుతూహలివైతివి. విదేహకైవల్యంబనెడి మోక్షము జ్ఞానులకే ప్రాప్తించును. సాకారబ్రహ్మమునుస్వామిని పూజావిధానాదికములనర్చించి నిరాకారబ్రహ్మను ధ్యానించినవారికి మోక్షము పెరటిలోని కదళీవృక్షమువంటిదగును. సాంఖ్యసూత్ర, ఛాయాపురుష, లక్షణ, నాదానంద భావ, పంచముద్రాభావ, తారకమంత్రప్రభావ, సచ్చిదానందలక్షణ, ఆకారనిరాకారభావ, దర్పకభావ, అవానన్క, యెరుకప్రకార, అచల పరిపూర్ణంబులను, పండ్రెండు నామములతో వేదాంతమొప్పారుచుండును. అట్టి ద్వాదశవిధవేదాంతభావములను గురుముఖంబున బోధింపబడి పునర్జన్మలేని మోక్షసామ్రాజ్యమందిన మహారాజులచరిత్రలను దెలిపెదను. సావధానచిత్తుండవై మనువిని యిట్లు చెప్పనారంభించెను.

---

## 1. వీరసింహమహారాజు కథ.

పూర్వము చంద్రశేఖరుఁడనుమహారాజు మత్స్యదేశమును బాలింపుచుండెను. అతనికి వీరసింహుఁడను పుత్రుండుగలఁడు. అతఁడు మిగుల సౌందర్యవంతుఁడు. అతనికి మంత్రిపుత్రుఁడైన నీతిమంతుఁ డెల్లవేళల తోడునీడయైయుండువాఁడు. ఒకనాఁడా రాజమంత్రిపుత్రు లిరువురును భూసంచారముచేయుదలంపున నెవరికిఁ దెలియకుండ నర్ధరాత్రివేళ నశ్వారూఢులై పయనమైరి. వారిట్లుబయలుదేరి క్రూరమృగసంకులంబులగు నరణ్యములను గిరులను నదులనుదాటి బహుయోజనములదూరము వోయిరి. అంత రాజపుత్రునకు దాహముకాఁగా నీతిమంతునిబిలచి, నా కెక్కుడుగ దాహమగుచున్నది ముందునకు రాఁజాలను. ఎచ్చటనైన జలముఁదెచ్చి యొసంగుమని తత్ప్రాంతమందలి యొకమఱ్ఱిచెట్టునీడ నాసీనుఁడయ్యెను.

నీతిమంతుఁడు దాహమును దెచ్చుటకేఁగి కొంతదూరమున నొక సారంగమార్గమున జొరబడిపోవుచుండ నొకతపస్విమణి నీతిమంతునడ్డుకొని, ఓయీ! నీవు మనుష్యుఁడవు. దేవతలుండు నిచ్చోటున కేల రాసాహసించితివని కోపవుజూపుల జూచుచు నతనిపై మంత్రోదకమునుజల్లి వానరరూపుని గావించెను. ఆమర్కటమునుగూడ నింతదనుకనున్న మర్కటసమూహమునఁజేర్చెను. ఇటవీరసింహుండు నీతిమంతునకై చూచి చూచి విసిగి మరల ప్రయాణమై ముందునకు బోవుచు నొక్కచో నుసిరికపండ్లను భక్షించి దాహముందీర్చుకొని యొక నదీతీరమునకు జేరెను. ఆనదిలో కడుపునిండ నీరుద్రావుచుండ నానదియం దొక దీర్ఘశిరోజము కన్పట్టెను. వీరసింహుఁడా కేశసౌందర్యమును దిలకించి యిట్టిశిరోజములతో నొప్పు లలనామణి యెంతయందగత్తెయో యని వింతపడి యొక్కమారు నీతిమంతునిదలంచి యటనుండి బయలుదేరిపోవుచు గ్రమంబున మతంగమహాముని యాశ్రమమును జేరెను.

వీరసింహుడా మునికి నమస్కరించి మార్గమందు నడచిన వృత్తాంతము నుజెప్పి తనకడనున్న శిరోజమును జూపగా మునిశ్రేష్ఠుండు రాజా! దేవలోకమందుండు నలూబాచి యను నచ్చరభూలోకమునకు వచ్చి విహరించుచుండ వేటకై విపినంబునకువచ్చి సమరుత్త భూపాలుని కామించి యాతనివలన గర్భవతియై యొక ఆడుశిశువుంగని యీ శిశువు భారమంతయు నీదే ' యని పలికి నామగడుండు, నాకేమియు సంబంధము లేదు. నీయిష్టమువచ్చినట్లు చేసికొమ్మని తనరాజధానికి బోయెను. అంత యలూబాచి యాశిశువున కొకనామంబుగట్టించి కూతువను దివ్యచంద్రియని పేరిడి యామె నెలకొకమాడు నాగులువచ్చి నాది పోవుచుండెడిది. ఆ దివ్యచంద్రిక దినదినాభివృద్ధినంది నవయౌవనోద్భాసితయై మనుష్యలోకమునకి పెండ్లికాదగు మిరామిక్కిలా మానవులేరుగాని మార్గము దప్పి యా బిలమునం బ్రవేశించిన వెంటనే వారిని వానరరూపుల గావించుచుండెను. ఆమె స్నానము చేయుచుండ ప్రవాహములో గొట్టుకొని వచ్చినది శిరోజంబు. నీవిమంతుడా సారంగమార్గమున నేగి వానరరూపుడై యుండుండెనని భావించెనని చెప్పెను.

మాతంగముని పలుకులువిన్న వీరసింహుడు మూర్ఛితుండయ్యెను. ముని శైత్యోపచారములచే వానికి స్మృతి గలిగించి, రాజపుత్రా! నీ పిల్లిధైర్యమందున నేమిప్రయోజనము. నీకు వేదాంతరహస్యమార్గములలో నుత్తమమైన సాంఖ్యసూత్రము నెరిగించెద. అది హేయంబగు సంసారమును మరుభూమివంటిది. శబ్దభేదిమంత్రము నీకుపదేశింతును. దాన నీమనంబు నిశ్చలమగునని యష్టాక్షరిమంత్ర తత్వము నుజెప్పి కమలనప్రకమును వర్ణించి, నీవు కృతార్థుడవు. మాంసపిండమును మంత్రిపిండవా? నాసచ్చితి. అఖిలాన్వయుండగు యున్యయబ్రహ్మమునందు గగనంబున, గగనంబువలన వాయువును, వాయువువలన నగ్నియు దానివలన నీరును నీటివలన భూమియు గలిగినవి. విదాత్మ గగనంబు

లకు పగన్నగ సంబంధముండుటచే జ్ఞానంబును, వాయురాకాశముల కలయికచే హృదయంబును ఆకసము నగ్నియు గలియుటచే బుద్ధియును జలగగనంబుల సంగమంబున చిత్తంబును, భూమ్యాకాశ మిశ్రమంబున నహంకారమును నేర్పడినవి. గగనాత్మకంబులను వీని నంతరింద్రియము లందురు. బహిరింద్రియంబులు త్వక్చక్షుశ్శ్రోత్ర ఘ్రాణంబులు. జలా జలాత్మకంబులు శబ్ద స్పర్శ రూపరస గంధములు. అవియు నైదే. పృథివ్యాత్మకంబులైన నైదును వాక్పాణి పాదపాయూపస్థలను పేర కర్మేంద్రియము లనబడుచున్నవి ఈపంచవింశతియు గూడి దేహమగు చున్నది

| పృథ్వీపంచకము | జలపంచకము | అగ్నిపంచకము | వాయుపంచకము | అగ్నిపంచకము |
|---|---|---|---|---|
| 1 అహంకారము | 1 చిత్తము | 1 బుద్ధి | 1 మనస్సు | 1 జ్ఞాత |
| 2 అపానము | 2 ప్రాణి | 2 ఉదానము | 2 వ్యానము | 2 సమానము |
| 3 ఘ్రాణము | 3 నాలుక | 3 చక్షువు | 3 త్వక్కు | 3 శ్రోత్రము |
| 4 గంధము | 4 రసము | 4 రూపము | 4 స్పర్శము | 4 శబ్దము |
| 5 వాయువు | 5 గుహ్యము | 5 పాదము | 5 పాణి | 5 వాక్కు |

త్వక్కునకు విషయము రూపము. సూర్యుడధిదైవతము. శ్రోత్రమునకు విషయము శబ్దముగను దిక్కు అధిదేవతగ నుండును. జిహ్వకు విషయము రసము. వరుణు డధిదేవత. వచనము వాక్కునకు విషయము అగ్ని యధిదేవత. దానము ప్రాణికి విషయము. విష్ణు వధిదేవత. గుహ్యమున కానందము విషయముగను బ్రహ్మ యధిదేవతగ నుండును. వాయువు విసర్జనమునకు విషయము. మృత్యు వధిదేవత. హృదయమందు ప్రాణవాయువును, గుదమందపానవాయువును కాయమునందు వ్యానవాయువు, ఉదానవాయువు కంఠమునందును, నాభియందు సమానవాయువు నుండును. మఱియు నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయులను నైదువాయువులు దేహాక్రాంతములై

యుండును. హృదయమున శీతాగ్నియు, కుక్షియందు జఠరాగ్నియు కన్నులందు కోపాగ్నియు, కనుబొమ్మలందు జ్ఞానాగ్నియు, పాదము లందు కాలాగ్నియు నుండును. వీనిని పంచాగ్నులందురు. ఆత్మారాముడీ యగ్నిపంచక మధ్యమునసుండును. జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థలలో హృదయమందు జాగరణము, కంఠమున స్వప్నము, త్రికూటమున సుషుప్తియు నుండును. ఈమూడవస్థలు హస్తులకును, మునులకు తుర్యా తుర్యాతీతంబులను మూడును నియమితములైనవి. వీనిలో సుషుప్తి యుత్తమోత్తమని పెద్దలు నిర్ణయించిరి. ఈయవస్థయందాత్మారాము డింద్రియసాంగత్యము లేక నిర్మలుడై యుండును. చిత్తము ప్రాణవాయువుతో గలిసి జిహ్వనుండి రసగ్రహణము చేసి గుహ్యాదులు మదించి యుంట శుక్రశోణితంబు లుప్పొంగి వృద్ధినంది పిండరూపమై మణిపూరకమలంబున సమానవాయు పోషణమున విష్ణుసన్నిధి నంగనిర్మాణమును క్రమముగానయి మూత్రద్వారమున మాతృపోషితమగును. తండ్రి శుక్రమెక్కువైన శిశువు నల్లగాను, తల్లి శుక్రమెక్కువైన నెఱ్ఱగను, రెండును సమములైన చామన చాయగను పుట్టుదురు. ఇట్టి తుచ్ఛేంద్రియ సౌఖ్యము నాశించి మోహితుడవు కానేల? యని మంత్రోపదేశ మొనరించెను. వీరసింహుడామునిని కుపచర్యలంగావించుచు నందే యుండెను.

ఇట్లు చెప్పి కృష్ణభగవాను నర్జునుం జూచి, బావా! అవాఙ్మానసగోచరుండవగు నీ వలన నమూల్యోపదేశమంది ధన్యుండనైతి. వీరసింహు డేమయ్యెనో దివ్యచంద్రిక భావిచరిత మెట్లయ్యెనో తెలిపి నా చిత్తమునకు స్థైర్యమును గూర్పుమన కృష్ణుండు, అర్జునా! వీరసింహుండు మునిసేవ యొనర్చుచుండియు దివ్యచంద్రికకై బెంగగొన్నట్లగుపింప, రాజపుత్రా! నీవు దివ్యచంద్రికకొరకు నీ మిత్రునికొరకు పరితపించుచున్నట్లు నీ మొగమే తెల్పుచున్నది. కావున నీవు సారంగమున

బ్రవేశించి లోనికరిగి, దివ్యచంద్రికాయని యెలుగెత్తి పిలువుము. ఆమె వచ్చి నీ వెవ్వఁడవనియడిగిన దేవదూతనని చెప్పుము. నీకు శుభంబగునని పలికెను. వీరసింహుఁడు వెంటనే మునియానతి నా బిలద్వారమున లోనికిఁబోయి ‘ దివ్యచంద్రికా ’ యని బిలచెను ఆమె వెంటనే వీరసింహునికడకువచ్చి, నీ వెవ్వఁడవు ? నా పేరెట్లు తెలిసికొంటివనియడుగ మతంగునికడనచ్చినవృత్తాంతమంతయు దెలిపెను. దివ్యచంద్రిక ఇతఁడు మానవుఁడైనను శాపోపహతుఁడైన మతంగుడు మండిపడునని భయపడి యేమిచేయుటకుదోపక తల్లి నిస్మరించెను. ఆమెయు వెంటనే ప్రత్యక్షమై, సమాచారమేమనియడుగ వీరసింహునిచూపెను. ఉలూచి నవమన్మథాకారుండగు వీరసింహునిచూచి యానందముతో, బిడ్డా ! ఇతనిని మానవుడని సంశయింపక పెండ్లాడుము. మతంగమునివలన దేవరహస్యములలో గొప్పవాడయ్యెనని సమ్మతిపఱచి మహావైభవంబున వివాహము గావించెను,

వీరసింహుఁడా దివ్యచంద్రికతో కొన్నిదినంబు లానందమున గడపి యొకనాడు మంత్రిపుత్రుడు స్మరణకురా ఖిన్నుఁడై యుండెను. భర్త దుఃఖితుఁడై యుంట దివ్యచంద్రిక చూచి కారణమడిగెను. అంత వీరసింహుఁడు నీతిమంతునిగూర్చిచెప్ప నామె తనకడనున్న వానరముల నన్నిటిని మానవులుగమార్చెను. వీరసింహుఁడు నీతిమంతుని గుర్తించి కౌగిలించుకొని తక్కినవారిని విడిచిపుచ్చెను. ఇట్లు వారు మువ్వురు నా సొరంగమున హాయిగనుండ నీతిమంతుఁడు తాము బయలుదేరినది తెలియక చంద్రశేఖరమహారాజు పరితపించునని తలంచి వీరసింహునితో మిత్రమా ! మనము భూసంచారమునకు వెడలి చాలకాలమైనది. ఇంటికడ నీనా జననీ జనకులు మనకై విలపించుచుందురు కాన యింటి కేగుదమనెను. వీరసింహుఁడామాటలు విని యాసంగతి నెఱింగి రాజభటులచే వెదకించి

భూసంచారమేగిరని వారూరకుందురు. మరేమియు ప్రివాదములేదు. మరికొంతకాలమిటనుందము. ఇపుడే పోదుమన్న దివ్యచంద్రిక దిగులు పడునని నీతిమంతుని సమ్మతిజేసెను. ఒకనాడు వీరసింహుడు దివ్యచంద్రికతో పడకటింట నా సంగతి తెలిపెను. అంత నామె, మీ మిత్రుడగు నీతిమంతుని నా సఖురాలు చంద్రవదన మోహించియున్నది. వారిరువురకు వివాహ మొనరింతుమన వీరసింహుడాసంగతి నీతిమంతునకు దెలిపెను. అతడు సమ్మతించినంతనే వివాహ మొనర్చెను. అట్లారాణ్మంత్రి పుత్రులు భార్యలతో హాయిగ గొంతకాలము గడపిరి. మరల మంత్రి పుత్రునకు స్వదేశముతలంపునకు వచ్చి రాజపుత్రునితో, చెలికాడా! మనమిట్లన్యప్రదేశమున భార్యలతో కులుకుచుండ నింటికడ మన తలిదండ్రులు మనకై దుఃఖించుచుందురు. ఇది భావ్యము కాదు. నేనొక్క నిమిషమైన నిందుండజాలను. అని వదింప వీరసింహుడు సమ్మతించి దివ్యచంద్రికతో దన పయన సమాచారమెరిగింప నామెయు, నాథా! మీరులేని యీ రాజ్యము నాకేల? నేనును మీ వెంటవత్తునని భర్త నొప్పించి రెండు కీలుగుఱ్ఱములను దెప్పించెను. అందొకదానిపై దివ్య చంద్రికా వీరసింహులును, రెండవదానిపై చంద్రవదనా నీతిమంతులును గూర్చుండి విహాయసపథంబున పయనంబొనర్చుచు మధ్యేమార్గమున కళింగరాజధానీనగరంబున విశ్రాంతికై యాగిరి. వారొకసత్రమున బస చేసి భోజనంబుల దీర్చికొని కూటమున్న బాటసారి నొకనిం జూచి, అయ్యా! ఈ పట్టణమంతయు మంగళకరంబగు తోరణములతో నలంకారములతో నిండియున్నదేమని ప్రశ్నించెను. అంత నా బాటసారి, ఆర్యా! ఈ నగరమేలు రాజుకూతురు లనంగాంతకు స్వయంవరమహోత్సవము జరుగుచున్నది. ఆ రాజొక మత్స్యయంత్రమును సభామంటపమునుంచి దానిని లక్ష్యయుక్తముగ భేదించినవానికి తనకూతు నిత్తునని చాటించెను. అదియే యీ వేడుక. అనగా వీరసింహుడు దివ్యచంద్రిక

సమ్మతిపై యీ స్వయంవరమంటపమునకేగి యింతదనుక దానిం గొట్ట లేక తెల్లపోయి కూర్చున్న రాజులందఱారశ్చమంద త్రుటికాలములో నా యంత్రమును భేదించెను. కళింగదేశపురాజు వీరసింహుని రూపరే ఖల కానందమంది మహావైభవంబున పెండ్లియొనర్చెను. వీరసింహుడు లవంగలతతో మహదానందమున నా రాజ్యమున గొంతకాలముండి యుత్తమాములశెలంది మత్స్యపురికి దివ్యచంద్రికా లవంగలతలతో బయనమై కొలదిదినంబులకు స్వనగరమును బ్రవేశించెను. చంద్రశేఖర భూపాలుండు కొడుకు కోడండ్రను మంత్రిపుత్రదంపతులనుగాంచి మిగులనానందమున నుత్సవాదులొనరించి వీరసింహునకు శుభముహూ ర్తమున పట్టముగట్టెను. నీతిమంతుడు మంత్రిపదవి నధిష్టింప నా వీరసిం హుడు జనరంజకముగ రాజ్యపాలనమొనర్చెను. అని చెప్పెను.

కృష్ణుండీరీతి కథముగింపగనే, బావా! నీవు చెప్పినకథ చాల హాయిగానున్నది. నేటికి నిదురింతమనిపలుక వా రిద్దరు నిద్రనందిరి.

---

## రెండవరాత్రికథ.

రెండవనాటిరాత్రి భోజనానంతర మా కృష్ణుడు యమునాతీర మున చల్లగాలి సేవించుచుండ నర్జునుడు మఱియొకకథ జెప్పుమని యడుగ శ్రీకృష్ణుండిట్లు వచింపమొదలిడెను.

## సూర్యదత్తునికథ.

తొల్లి జగన్మిత్రుండనురాజు చేరదేశమునకురాజు. అతనిభార్య సురభిదేవి. ఆమెయందు జగన్మిత్రుని కసమానరూపలావణ్యవిభ్రాసి

తుండగు నొకకుమారుడు పుట్టెను. ఆ బాలునకుఁ జననీజనకులు సూర్య దత్తుండని పేరుపెట్టి మిగుల గారాబమున పెంచుచు సమస్తవిద్యలను తగినగురువులచే చెప్పించి ధనుర్విద్యయందును యుద్ధరంగప్రవీణతయం దును నుద్దండునిగావించిరి. సూర్యదత్తుండు నవయౌవనోద్భాసితుండై భూసంచారము చేయునుద్దేశమున తలిదండ్రులకు తెలిపిన నంగీకరింపరని యొకయర్ధరాత్రిమున నగరమువీడి బయలుదేరెను. జగన్మిత్రుఁ డుదయ మున పుత్రునిజాడ తెలియక రాజభటులను నలుదిక్కులకుబంపి వెదకించి విఫలప్రయత్నుడై యూరకుండెను. సూర్యదత్తు డశ్వారూఢుడై భీక రారణ్యంబులనెన్నో గడచి వన్యఫలంబులను భక్షింపుచు సెలయేటినీరు ద్రావుచు ప్రకృతిసౌందర్యవిశేషముల కానందించుచు పోయిపోయి తుట్టదుదకు కేరళదేశరాజధానీనగరప్రాంతమందలి యొకయుద్యానమున బ్రవేశించెను. ఆయారామంబు బహువిధసుగంధవృక్షములతో నిండి కుసుమసౌరంభంబున సుఖదాయియై యుండెను. సూర్యదత్తు డవ్వనమున నశ్వము నొకచెట్టునకుఁగట్టి యందలి కమలాకరమున నీరుద్రావి యొక పాలరాతితిన్నెపై విశ్రమించెను. మార్గాయాసశ్రమమునీఁగుట కేటికైన నిట్టివేగదా సహాయభూతములు?

ఇంతలో సూర్యదత్తునిచెవుల కత్యంతసుఖప్రదంబుగ రమణీ మణుల గానరవమొందుసోకెను. అతండదివిని ఇది రాజోద్యానంబుగా నోపు. ఆ తరుణులీ సరోవరమున జలక్రీడలాడుదురుగాబోలు. ఇవుడేమి చేయుదునని యాలోచించి యచటనున్న వృక్షశాఖాగ్రములదాగెను. అంత నా రమణులరుదెంచిరి. అందొకతె మిగులసౌందర్యవతియై యున్నది. ఆమె రాజపుత్రికయైయుండునని సూర్యదత్తు డూహించెను. అయ్యంగనలావనమునఁ గొంతసేపాడి పిదప జలాశయమున జలక్రీడలాడ దొడంగిరి. అత్తరిసూర్యదత్తుండా రాజపుత్రికం గాంచి మోహావేశపరుండై 'ఈ వనితామణిని పరిణయంబాడని నాజన్మ[illegible]' యని తలంచి,

ఈపె సాధారణముగ నలభ్యయని శంకించి విల్లున నమ్ముగూర్చి యాపె సరోవరతీరముననుంచిన చీరను రవికను గురిచూచి లాఘవంబున సంగ్రహించెను. రాజపుత్రిక జలక్రీడానంతరము సరస్తీరమున కరుదెంచి తన వలువలు లేమికి జింతించి యటనున్న బాణఘాతమున కాశ్చర్యపడి యంతిపురినుండి వేరువలువను దెప్పించి ధరించి గృహంబునకరిగి యా సమాచారమును జననీజనకుల కెరింగించెను. ఆమెతండ్రి జయదేవ భూపాలుండు నిజనచివుండగు వినయశీలుని వెంటనిడుకొని బాణఘాత ప్రదేశమునకరిగి చూచి మంత్రినిదేనునియముగ నతిండు మహారాజా! ధనుర్విద్యావిశారదుండగు రాజపుత్రుండెవడో తమతనయ వలువలను హరించెనని చెప్పెను. జయదేవుడాసంగతి కుమార్తెకు దెలుప నామె, తండ్రీ! ఆ రాజపుత్రుడు జలకేళిదేలు నా యంగసౌష్టవమును గాంచియుండును. అట్టియెడ నేను వేరొకనిని వివాహమాడజాలను. అతనిని వెదకి తెప్పింపుడని వచించెను. మహారాజు వినయశీలున కా రాజపుత్రుని నన్వేషించుట కాజ్ఞయిడెను.

సూర్యదత్తుండు రాజపుత్రిక వలువలను సంగ్రహించి యటనుండి బయలువెడలి క్రూరమృగసంకులంబైన నరణ్యములను గడచిపోవుచుండెనేకాని హృదయ మా రాజపుత్రికయందే నిలచియుండెను. ఏ వస్తువు చూచినను వానినేత్రములకు రాకొమరితవలెనే కన్పట్టుచుండెను. తుద కాతడగస్త్యుని యాశ్రమంబుచేరి మునికి నమస్కరించి తాను కేరళరాజపుత్రికపై మనసునిలిపినట్లు చెప్పి యామె నాకెట్లు లభ్యమగునో తెలుపుమని ప్రార్థించెను. అంత యగస్త్యుండు, రాజపుత్రా! మదనానల పీడితుండవై విరహవేదననందు టుత్తమరాజపుత్ర లక్షణముకాదు. వేదాంతబోధమున కెడపసోపానంబగు ఛాయాపురుషలక్షణము నెరిగింతు వినుము.

"సూర్యదత్తా! సకార, ఓంకారంబును, బిందువుతోనున్న హాకారంబునునగు హంసాక్షరములరెండింటిని సూర్యవిముఖుండవై నిలబడి జపింపుము. అపుడు నీ తనుచ్ఛాయనుజూచి జీవాక్షరస్థానమున నీ దృష్టినిలిపి స్థిరదృష్టితో జూడుము. ఛాయాపురుషుడు మేఘమధ్యమున గన్పట్టును. అతడు శిరోవిహీనుడై యగపడిన నారుమాసముల కును, హస్తహీనుడై కాన్పించిన మూమ్మాసములకును, పాదహీనుడై గోచరించిన నొక మాసమునకును చావుకలుగును. ఛాయరక్తాక్తముగ నున్నట్లగపడిన సామ్రాజ్యభోగంబును, కనుపురంగుగ నున్న చక్రవర్తిత్వము, తెల్లగనున్న నారోగ్యబాధయు, దరిద్రత్వము సంభవించును. అని చెప్ప నాతడట్లే జపించెను. అగస్త్యుండు నీకిపుడు ఛాయాపురుషుం డెట్లు కన్పట్టుచున్నాడో వచింపుమన సూర్యదత్తుండు, స్వామీ! తెలుపు పసుపు మొలుపు రంగులతో గన్పట్టుచున్నాడని చెప్పెను. అంత నగస్త్యుండు, నాయనా! నీకేమియు నశుభంబుకాదు. శుభంబేయని చెప్పె నని కృష్ణుండాగెను.

అపుడర్జునుండు, మహాత్మా! ఈ రెండవకథ యింతవరకువిన్న నాకానందమైనది. పిదప న సూర్యదత్తు డేమిచేసెను. అతనిని వెదుక యత్నించు విజయశీలుం డేమయ్యెనో తెలుపుడని ప్రశ్నింప కృష్ణుం డిట్లు వచించెను.

సూర్యదత్తు డగస్త్యాశ్రమమందున్న కాలమున నొకనాడు ఫల సమిత్కుశాదులం దెచ్చుటకై విపినాంతరమున కరిగెను. అందతనికిం గొందఱు బాటసారులు గన్పట్టిరి. అతడు వారింగాంచి, అయ్యా! మీరీ వనంబులంబడి యెందేగుచున్నారని ప్రశ్నింపవారు, రాజపుత్రా! మేము జయపురరాజగు యశస్విలకుని కూతురిందిరాదేవి స్వయంవర మహోత్సవమున కేగుచున్నాము. ఆ రాజాస్వయంవర సందర్భమున

నొక శౌరికాయంత్రము నేర్పఱచి దానిం గొట్టినవానికి కూతు నిత్తునని చాటించెను. అనిపలుక సూర్యదత్తుండా యుత్సవమునకేగు కుతూహలమున రయంబున నగస్త్యుని చెంతకుం బోయి, జయపురంబునకుం బోవ ననుజ్ఞయిమ్మన నా మునిపుంగవుడు, నీకు శుభంబగు పోయిరమ్మనెను. అతడు వెంటనే జయపురంబునకు పయనమై వచ్చుచుండ మార్గమధ్యమున మఱియొక మార్గమున వచ్చు వినయశీలుడు కలిసెను. మాసిన బట్టలు కట్టినను తేజంబు మాయక వెలయు సూర్యదత్తుని వినయశీలుడు చూచి, ఇతడే మా రాజపుత్రిక వలువలను సంగ్రహించిన వాడై నట్లు నా మనంబునకు తట్టుచున్నది. ఇతని చరిత్ర మెఱుంగవలయునని మాటలుకలిపి మాటల మధ్యమున, రాజపుత్రా! మనమిప్పుడు నడచు ననముపంటి రమణీయవనంబు నెందును చూడబోమనెను. అప్పుడు సూర్యదత్తుడు మీరివ్వనమ్ముం జూచియే వింతపడుచున్నారు. కేరళదేశ రాజధానీనగరమునకు పరిసరమునను యుపవనంబుంగాంచిన వివశులగుదురేమో యనెను. అంతలో వారు కొంత ముందునకుబోగా నచట నొక సరోవరము కాన్పించెను. వినయశీలుడంత, ఆహా! ఈకమలాకర మెంత మనోహరముగా నున్నదనెను. సూర్యదత్తుడదివిని, కేరళ రాజధాని నగరమునకు పరిసరమునను పద్మాకరము గాంచిన నెన్నటికి నటనుండి కదలి రానేరవనెను. ఆవన మెవ్వరిదని వినయశీలుడు ప్రశ్నింప కేరళదేశమేలు జయదేవునదట యని సూర్యదత్తు డుత్తరమిచ్చెను. ఆ యుద్యానవన పద్మాకరంబులను నీవెట్లు చూచితివని వినయశీలుడు పృచ్ఛసేయ, సూర్యదత్తుడు తానా నమున జేరుట, రాజపుత్రికను చూచి మోహించుట, ఆమె వలువలను శరలాఘవమున గ్రహించుటమున్నగు విషయములను జెప్పి నలువల నాతనికిం జూపెను. అంత వినయశీలుడు ముదితస్వాంతుడై, రాజకుమారా! నిన్ను గాంచి నేను ధన్యుండనైతిని. నేను జయదేవుని సచివుడను నా పేరు వినయశీలుడు. మా రాజపుత్రిక తన వలువలను సంగ్రహించిన వానిని దక్క నన్యుని

పరిణయమాడ నొల్లనని ప్రతిజ్ఞపట్టినది. రాజాజ్ఞచే నందులకై నిన్నన్వేషించుచు దేశముల దిరుగుచుంటిని. నీవు నావెంట కేరళమునకు రమ్మనెను.

అంత సూర్యదత్తుండు, ఆర్యా! తమదర్శనము నాకు శుభోదర్కమగుట నానందమైనది. మనమిప్పుడు జయపురాధీశు తనయకగు స్వయంవర మహోత్సవమునకేగి పిదప కేరళమునకు బోదమనెను. అపుడు వినయశీలుడు, సూర్యదత్తా! నీవొకవేళ జయపురమున శౌరికాయంత్రమును భేదించి యిందిరాదేవిని బాణయంబైనను మారాజపుత్రి చిత్రరేఖనే పట్టపురాణిగ జేయవలయునుజుమీ యన నతడంగీకరించెను. వారిరువురు జయపురంబుచేరిరి. మరునాడే స్వయంవరము వివిధదేశాధీశులచే స్వయంవరమండపము నిండియుండెను. తెల్లవారగనే వినయశీల సూర్యదత్తులు స్వయంవర మంటపమున కరిగిరి. అందున్న రాజపుత్రులు శౌరికాయంత్రము చూచుటకే యలవికాకుండుట వలన భేదించుట దుర్ఘటమని నిరాశోపహతులై యున్నవారుండిరి. సూర్యదత్తుడా సభామధ్యమమునకుజని నలినవసనధారియై యుజ్వ మహాతేజంబున నుజ్జ్వలించుచు లేచి యంత్రాంత్యము సద్దమునఁజూచి శరసంధానమొనర్చి త్రుటిలో భేదించెను. అచటివారెల్ల రీతనిలావణ్యుడును మహాతేజసమున్నుండెనవో యని యక్కజంపడిరి. జయపురాధీశుండిందిరాదేవి నతనికిచ్చి పరిణయ మొనర్చెను. సూర్యదత్తునట గొన్నిదినంబులుండి భార్యతోగూడ వినయశీలునివెంట కేరళమునకు వచ్చెను. జయదేవుడు చారులవలనను వీరిరాకవిని పురమలంకరింపజేసి యెదురేగి గౌరవించి తనకూతురు చిత్రరేఖను సూర్యదత్తున కొసంగి మహావైభవంబున వివాహంబు గావించెను. సూర్యదత్తునట గొంతకాలముండి యుండిపిదప చిత్రరేఖలతో స్వదేశమునకరిగెను. అతని జననీజనకులు

చిరకాలమునకు వచ్చిన కుమారుని కోడండ్రనుగాంచి మహానంద మందిరి. జగన్మిత్ర నృపాలుండు సూర్యదత్తునకు రాజ్యాభిషేక మొనర్చి తాను వానప్రస్థుడయ్యెను. అని కృష్ణుండు కథముగించునప్పటికి, యర్జునుడు నిదరవచ్చుటచే నిద్రించెను.

---

## మూడవరాత్రి కథ.

మూడవనాటిరాత్రి కృష్ణార్జునులు యమునానదీ తీరమునకు విహారింపవచ్చిరి. అర్జునుడు నేడుకూడ హృదయశాంతి నాపాదించుగాథ నొకదానిని చెప్పుమని యడుగ కృష్ణుండు వల్లెయని, నేడు నీకు ఇందుపాల మహారాజుకథ తెలిపెద నాలింపుమనెను.

### 3. ఇందుపాలునికథ.

దిలీపుండను మహారాజొకప్పు డంగదేశమును పాలింపుచుండెను. అతని భార్య వసంతాదేవి. వారికి చిరకాలము సంతతిలేమి తపంబొనర్చిరి. ఆతపఃఫలముగ నొక పుత్రుఁడుదయించెను. ఆ బాలున కిందు పాలుఁడని నామకరణ మొనర్చి సకలవిద్యాపారీణుఁగఁజేసిరి. ఇందుపాలుడు యౌవ్వనరాజ్య పట్టభద్రుడై యనుదినము తన పంచకల్యాణి యను గుఱ్ఱము నెక్కి నగరోపకంఠమున విహారించువాఁడు. ఒకనాడట్లు విహారించుచుండ నెనుబదేండ్ల వయస్సుమించిన వృద్ధురాలొకతె యతనిని సమీపించి, నాయనా! ప్రతిదినమున నీవేనా దరిద్రురాలనగు నాపిడుకలను గుఱ్ఱపుగిట్టలతో ముక్కముక్కలను చేయుదువ? అరుమా

సములు సాముచేసి మూలనున్న ముసలమ్మనుగొట్టిన సామెతగా పేదరాలనగు నాపై ననా నీపరాక్రమమని యేడ్చెను. ఇందుపాలుడందుల కాశ్చర్యపడి, అవ్వా! నీవృత్తియేమని యడిగెను. ఆమె, నాయనా! పిడుకలేరి కడుపు గడుపుకొనుచుంటిని? నీ పౌరుషము నామీద జూపుచున్నావు. నీకంత పౌరుషమున్నచో దానిమ్మకన్నెపై జూపి యామెను చెట్టబట్టవలెనన రాజపుత్రు డవ్వా! ఆమె సమాచారము నాకు తెల్పుమనెను.

అంత నావృద్ధురాలు, నాయనా! ఆమెనుగూర్చి నాకు గొలదిగా తెలియును. అంతవరకు చెప్పెద నేనొకనాడు విపిళ్ళనుసకు పిడుకలేరబోగా యెలుగొకటి నన్నెదుర్కొన పొదమాటున దాగితిని. ఆ పొదకు మఱియొక వంకనున్న యోగులిద్దరు తమలోదాము, సూర్యుని వలన నాగేంద్రునకు దనయురాలై జన్మించిన దానిమ్మకన్య తూర్పునను ద్రిమందలి సరస్సునందున్న దానిమ్మపూవు నందున్నదని చెప్పుకొనిరి. అది వినినపిమ్మట నేనింటికి వచ్చితినని చెప్పగా నిందుపాలు డామెకు వేయి వరహాలనిచ్చి దానిమ్మకన్యపై మనసునిలిపి దినదినము కృశించిపోవుచుండెను. అన్నపానాహారము మానెను. ఆసంగతి మంత్రిపుత్రుడగు సుబుద్ధి కనిపెట్టి నీవిచారకారణ మేమని రాజపుత్రు నడిగెను. ఇందుపాలుండు దానిమ్మకన్నె సంగతి చెప్పి యామె యున్నతావువచించి యామెకై పరితపించుచున్నానని వాక్రుచ్చెను.

సుబుద్ధి యావిషయమాలించి యాలోచించి యొక ప్రసిద్ధ శిల్పకారుని రావించి కీలుగుఱ్ఱము నొకదానిని చేయించి రాజపుత్రున కొసగి దీనిపై నీవాకన్నెయున్న తావునకరిగి పెండ్లియాడి రమ్మనెను. ఇందుపాలుడానందమున నాకీలుగుఱ్ఱమునెక్కి యాకాశపథంబున నేగుచు మాండవ్యమహాముని యాశ్రమ ప్రాంతమున కరుగువఱకమ్మాని తపో

మహిమంబున గుఱ్ఱము కీలుసడలి మున్యాశ్రమమున మూర్ఛిల్లిపడెను. మాండవ్యుని శిష్యుఁడొక డారాజపుత్రుని నవస్థగాంచి యుపచారము లొనర్చ కొంతవరకు తెప్పిరిల్లి మాండవ్యునిదర్శించి తనవృత్తాంతమును ప్రయాణకధను విశదంబుగజెప్పి గుఱ్ఱమునకుకీలు ప్రసాదింపుమని వేడెను. అపుడా మాండవ్యుఁడు, రాజపుత్రా! శరీరములు క్షణభంగురములు. భోగములు నంతియే అట్టివాని కాసపడక వేదాంతసౌధమునకు మూడవ సోపానంబగు నాదానంద పరిభావము నాచే వచింపబడును. దాని నాలించి యామార్గమునబోయి ముముక్షుడవగుము. మహాత్ములెందరో దానివలన తరించిరనిపలికి వెంటనే యిందుపాలునకు, ఓం, శ్రీ, హ్రీం, హం, నం, అను హంసపంచాక్షరీమంత్ర ముపదేశించి దీనిం బఠింపుమని యమ్మహర్షి పుంగవుండు తన రెండువ్రేళ్ళతో కర్ణరంధ్రములనుమూసి సముద్ర, భేరీ, తాళ, మృదంగ, భ్రమరాది దశవిధనాదంబులు తమ లోనణగియుండుట మానవులు గ్రహింపలేక పలుదుఃఖముల నందుచున్నారు. ఇడా పింగళనాడుల వాయుమార్గసంచారము నరికట్టి తక్కిన మార్గమును బలముచే రేచించి పూరించి కుంభించి తిరిగి రేచింపుము. అందణగియున్న దశవిధ నాదంబులును కర్ణరంధ్రములనుండి వెలుపలకు వచ్చి మ్రోగును. అపుడు చిత్తంబును నాదబ్రహ్మమను ప్రణవనాదమున లీలమొనర్చి కన్నులుమూసి కనుబొమ్మలందు దృష్టినిల్పి పరికించి చెప్పుమనెను. ఇందుపాలుడట్లే పంచాక్షరీమంత్రి జపమునుజేసి జపకుండలినిభేదింప నాదశవిధనాదము లాతని కర్ణపుటంబులఁజొచ్చెను. ఇందుపాలుడా ధ్వనులవిని మహదానందమున మాండవ్యుని పాదముల కెఱగి ధన్యుండనైతినని యతనినే సేవింపుచు నా యాశ్రమమున నుండెను. ఇట్లుండ నొకదినమున నాశ్రమముదాటి కొంతదవ్వరిగి యొక్కచో మహోన్నత వటవృక్షమువీక్షించి, యింత విశాలమైన యీవట మెనాటిదోగదా యని వింతపడుచు నావృక్షచ్ఛాయను విశ్ర

మించెను. అంతలో నాచెట్టుపైనున్న శకుంతసంతతులు భయమును సూచించు కిలకిలారవముసేయ నిందుపాలుడు తలయెత్తి చూచెను. అప్పుడొక సర్పమావృక్షమున కెగబ్రాకుట చూచి, ఈవిషోరగ మీపక్షి సంతతులను భక్షించును గాబోలునని విల్లెక్కిడి యొక్కబాణమున నా సర్పమునుగొట్ట నది నలుదిశలకు విషముజిమ్ముచు మరణించెను. ఇందు పాలుఁ డొక్కింతసేపటనుండి కదలి తత్ప్రాంతమునందలి సెలయేటికరిగి స్నానమొనర్చి నీరుద్రావెను. ఆజలము విషాన్వితమగుట నతఁడు చైతన్యహీనుడై సెలయేటియొడ్డున బడిపోయెను. వటవృక్షమందున పక్షులాచర్యను కన్నులారజూచి, మనల నిరంతరముబాధించి కులనాశనము చేయు సర్పమునుజంపిన మహాత్ముడు విషజలంబునుద్రావి మూర్ఛిల్లెను. వనమూలికలనుదెచ్చి జీవింపజేతుమన్న నంతటిశక్తి మనకింకను రాకపోయెనే యని చింతిల్లుచు నాహారార్థమేగిన తమ తలిదండ్రులు వచ్చునప్పటికి కిల కిల ధ్వని నపరిమితముగ జేసి వారి కిందుపాలుని సంగతి నివేదించినవి. అంత నావృద్ధవిహంగములు, బిడ్డలారా! విచారింపకుడు. తెల్లవారులోపున సంజీవి తెచ్చి యీ పరోపకారుని బ్రతికింతుమని వెంటనే యాకసమునకెగిరి మూలికలనుదెచ్చి యిందుపాలుని జీవితుని జేసి సెలయేటిని విషరహితముగ నొనర్చినవి.

ఇందుపాలుడు చైతన్యుడై నపిమ్మట· నాపక్షులు, ఆర్యా! మీరు పరోపకార పరాయణత మాకొనర్చినమేలు మరువరానిది. మా వలన తమకేదైన వలయునేని కోరిన యథాశక్తిగ నొనర్చి ప్రత్యుపకారఫల మందగలమని వచింప నతఁడు చానిమ్మకన్నె వృత్తాంతముచెప్పి యామె లభ్యమగుట కుపాయము జెప్పుమని యడిగెను. అంత నాపక్షులు, రాజకుమారా! మాండవ్యుని బోధామృతమును గ్రోలిన ధన్యుండవు. తూర్పుదిక్కులోని కొలనునందున్న పుష్పములో నాకన్నె యుండును. ఆకొలను రాక్షసరక్షితంబు ధైర్యవంతుడవై జాగరూ

కతతో కార్యము సాధింపవలెను. నిన్నుచటికి మేము గొంపోయెదమని చెప్పి యొకనాగపక్షి యిందుపాలుని వీపుపై నెక్కించుకొని యాకొలనుదరికి గొంపోవ నతడా పుష్పమునుగోసికొని తిరిగి పక్షివీపుపై నెక్కివచ్చుచుండ రక్కసులు చుట్టుముట్టిరి ఇందుపాలుడు భయమందక రక్కసుల నెదిరించి పోరుచుండెను. పక్షులు తమముక్కులతో రక్కసులనుబొడిచి బాధించెను. రాక్షసులు రణరంగమంతయు నంధకారవ్యాప్తముచేయ నిందుపాలు డగ్నియాస్త్రముతో దానిని భేదించి రక్కసుల జక్కాడి పటవృక్షముకడకు వచ్చెను. తరువాత నా పక్షులు, "దానివృక్షపుష్పములోనున్న కన్యామిన్నా! యిటరమ్మా" అనగానే యక్కన్య వెలుపలకురాగా యిందుపాలుడు చూచి మూర్ఛిల్లెను. పక్షులాతని కుపచారములుసేయ తెప్పిరిల్లెను. నాగేంద్రున కీసమాచారము తెలిసి నాకసమునకరిగి యింద్రుని సహాయము కోరెను. పాకశాసనుడు సర్పరాజుతో, నాగేంద్రా! అక్కన్యం గొనిపోయిన రాజపుత్రుండు మహావీరుడు. పక్షులన్నియు వేడ గరుత్మంతుడుకూడ రావచ్చును. ముందు మీరేగి రణమొనర్చి వానినిదంప యత్నింపుడు. సాధ్యము కానిచో యపుడు నేనువచ్చి యుద్ధమును మాన్పించి దానిమ్మకన్నె నాతనికిచ్చి పెండ్లిసేయుదునని చెప్పిపంపెను. నాగరాజు సర్పసైన్యములనుగొని యిందుపాలుని, పక్షులను నెదిరింపబోయెను. పక్షులు గరుత్మంతుని ప్రార్థించి తోడ్తెచ్చినవి. ఇందుపాలు డాగ్నేయాస్త్రంబున సర్పములను పలుబాముల బెట్టెను. నాగరాజు వారిధాటికి కాగలేక యింద్రునిదలంప నా నాకలోకాధిపతివచ్చి, గరుడునకును నాగేంద్రునకును స్నేహమొనర్చి యిందుపాలునకు దానిమ్మకన్నెను వివాహమొనరించెను.

వివాహానంతరము పక్షులాదంపతుల నంగదేశమునకు గొంపోవుచుండ నిందుపాలుడు భార్యతోగూడ మాండవ్యాశ్రమమున నాగి

యమ్మునిని దర్శించి యాశీస్సులంది యంగదేశమును చేరెను. దిలీపుడపూర్వ లావణ్యవిలాశిని యగు కోడలిని, కొడుకునుంగాంచి మహదానంద భరితుండై యొక శుభముహూర్తమున నిందుపాలునకు రాజ్యాభిషేక మొనర్చెనని కృష్ణుండు ముగింప నర్జునుండీకథ మిగుల రసవంతముగా నున్నదని నాటికి నిద్రించెను.

---

## నాల్గవరాత్రి కథ.

నాల్గవనాటి నిశాసమయంబున కృష్ణార్జునులు యథాప్రకారము యమునానదిపై కత్తస్థలినిగూర్చుండ నర్జునుడు, బావా! నేడెట్టి మనోహరమైనకథ జెప్పెదువో యన లక్ష్మీనాథుండు, నేడు రవివర్మమహారాజుకథ చెప్పెద నాలింపుమని యిట్లు చెప్పదొడంగెను.

## 4. రవివర్మ కథ.

పూర్వము కాశ్మీర దేశమును రవివర్మ యనురాజు పాలింపుచుండెను. అతడు సుశీలయనెడి భార్యతోగూడ సంతతికై చాలకాలము పరితపించెను. ఇంతిలో సుశీల వ్యాధిగ్రస్తయై పరమపదించెను. నాటినుండి యా రాజు రాజ్యమునువీడి మహారణ్యములకరిగి ఘోరతపంబొనర్చెను. అతిపోమహిమంబున నతడేకార్యము చేయనెంచిన నది తత్క్షణము సిద్ధించుచుండెను. రవివర్మ కొంతకాలమునకు రాజర్షి యయ్యెను. అతని యుపదేశామృతమునుగోరి పలువురాతనికి శిష్యులై సేవించుచుండిరి. అట్టివారిలో పూర్ణానందుడను నతడు ప్రియశిష్యుడు. ఒకనాడాతని శిష్యులందఱును వేదాంతచర్చల జేయుచుండిరి.

అందు నిత్యానందుడను శిష్యుడొక డుండెను. ఆచర్యానమయమున
నిత్యానందునికడ కొకవేశ్య వచ్చెను. అతడామెనుజూచి మాటునకు
బోయెను. అంత నావారాంగన, నిత్యానందా! ఏల మాటున దాగె
దవు. నీవు మునివై యుండి నన్నిట్లన్యాయము చేయవచ్చునా? నాతో
నిత్యానంద మనుభవించి ప్రతిరాత్రియును గూడ కని, యొక్కటకాసైన
నాచేతబెట్టక తుదకు దర్శనమైన నీయక నన్నేడ్పించుట ధర్మమా యని
గద్దించి యడిగెను. నిత్యానందుడు మొగము వెలవెలబోవ నయ్యంగ
నకు నాగుట్టు బయలుపరుపకుమని సంజ్ఞ చేసెను. ఆమె వినిపించుకొనక
మరింతబిగ్గరగా రట్టుసేయసాగెను. ఆ వెలవెలంది పరుషభాషణములు
వేదాంతనిధియగు పూర్ణానందుని చెవులబడ నతడీవలకువచ్చి, నీవెవరవని
వేశ్యనడిగెను. ఆమె తనకును నిత్యానందునకుగల సంబంధమును పూర్ణ
ముగ వక్కాణించెను. పూర్ణానందుడు వెల్లబారిన మొగమునున్న
నిత్యానందుని ముఖమువంకజూడ నతడు, పూర్ణానందా! నాకీమె యెవ
రో తెలియదు. ఈమె పలుకులు విశ్వసింపజనదనియెను. పూర్ణానందున
కేమియుదోపక దివ్యదృష్టింజూచి జరిగినది తెలిసికొని నిత్యానందుని
కోపదృష్టితో జూచుచు వెలయాలి నావలకుబొమ్మని కసంకొట్టెను.

పిదప పూర్ణానందుడు నిత్యానందునివంక మొగముద్రిప్పి, నీవస
త్యప్రలాపివి. నీమొగము చూడ దావలకు బొమ్మనెను. నిత్యానందు
డాపరాధవమ్మునకు వగచి కన్నులనుండి నీరు గార్చుచు పూర్ణానందుని
పాదములంబడి, మహాత్మా! మాయా మోహమునజిక్కి కామాం
ధుడనై వర్తించితి. ఇంక నట్టిపనికిబోను. బుద్ధివచ్చినది. క్షమింపుమని
ప్రార్థించెను. పూర్ణానందునకు నిత్యానందుని నోటవచ్చిన మాటలలో
మాయా మోహమన నేమియో తెలియక కొట్టుకొనుచు శిష్యులవంక
జూచి, మాయామోహమననేమో గురువర్యునడిగి తెలిసికొనవలెను.
నాకేమియు దెలియలేదని రవివర్మయోగి ప్రత్యక్షముగు మంత్రమును

బఠింప నట భయంకరశబ్దముపుట్టి పొగ బయలుదేరెను. అది తగ్గువ ఆకు దివ్యతేజశ్శాలియగు రవివర్మ రాజయోగి ప్రత్యక్షమయ్యెను. శిష్యులంద రానందభరితులై సాగిలబడి మొ్రొక్కిరి. అపుడాయోగి, పూర్ణానందా! నన్నేల స్మరించితివని యడుగగా నతడు గురువునకు జరిగిన దంతయుచెప్పి, మాయా మోహంబన నేమియో నాకు తెలియకున్నది. వివరించి చెప్పుడని యడిగెను. అపుడా రాజర్షి, మాయా మోహమన్నది. యొక గొప్పవిషయమే. అందు దగిలినవారధఃపతితులగుదురు. అది యనుభవము వలనగాని తెలియదు. దానికి గర్వమొకటిగూడ హేతువే. నీకు బ్రత్యక్షముగ దానిని జూపించెదను లే యని యంతర్హితుఁడయ్యెను. అట గొప్పమార్పు జరిగెను. ఆరాజర్షి సంచారమునకు బయలుదేర నొకచో నిత్యానందునిమాట వినబడెను. నిత్యానందా యని రవివర్మ పిలుచునప్పటికి నిత్యానందు డొక వేశ్యయింటిలోనుండి నీకొక హాని మిత్తునని యూసగొలుపుచుండెను. గురుని పిలుపు విని యతడీవలకురాగా, వారవనితకూడ వానివెంట నీవలకువచ్చెను. ఈమె యెవరని నిత్యానందుని రాజర్షి ప్రశ్నించెను. నేను వారకాంతనని యామె బదులుపలకగనే రవివర్మయోగి, దుష్టుడా! నీముఖము చూడగూడదని నిత్యానందుఁడీ తిప్పుగాయమని కాళ్ళపై బడెను. రవివర్మ నిత్యానందుని వెంటనిడుకొని చాలదూరము పయనించి కొన్నాళ్ళకు కామరూపదేశమును జేరిరి. అది స్త్రీ రాజ్యము. దానిని తిలోత్తలయను సంగినామణి పాలించుచుండెను. ఆదేశమునకు క్రొత్తగావచ్చినవారినందరబంధింప నామె తనపరిచారికలకాజ్ఞయిచ్చెను. రవివర్మ రాజధానీ నగరమువెలుపల మంత్రపఠనమొనర్చి బాలయోగి యయ్యెను. రవివర్మ నిత్యానందులు నగరిలోనికరిగిరి. ఆసమయముకే కాంభోజ రాజపుత్రుడు కామరూపదేశ రాణిని కామించి ససైన్యముగ దండెత్తి వచ్చెను. ఆసంగతి పరిచారికలెరిగి యతనిని బంధించి రాణికడకు

గొంపోయిరి. అతడామెను తూలనాడ కత్తితో నొకచోట వ్రేటువేసి నది. దాని కతడు సిగ్గుపడి స్వదేశమునకు మరలిపోయెను. అతరుణము ననే నిత్యానంద రవివర్మలను రాణి పరిచారికలు బంధించి యంతిపురికి జేకొనిపోయిరి.

అయ్యంగనలు నిత్యానందు నొకచో బంధించి రవివర్మ తేజంబు చూచి బంధింపక యొక తిన్నెపై గూర్చుండబెట్టి యేమేమో ప్రశ్నింప నత డొకదానికిగూడ బదులు పలుకలేదు. వారి నాయకురాలలిగి కరవాలమున నొకవ్రేటువేయ నవి యతని నేమియు జేయలేక పోయెను. మరొక మారట్లుచేయ యత్నించి విఫలురాలయ్యెను. అంత వారికి భయము కలిగి రాణికి నివేదింప యామె స్వయముగ నటకరుదెంచెను. రాణి వచ్చునరికి పరిచారికలు యోగికంఠమున కొక బండరాయి తగిలించిరి. అంత రాణివచ్చి సుందరాకారుడగు రవివర్మను గాంచెను. అతడు సమాధినుండి లేచి యసమాన సౌందర్యవతియగు తిలోతలను జూచి, 'జై అఖిలరంజన్' అను మంత్రము నుచ్చరింప గొప్పధ్వనియై యతని కంఠమందున్న శిల తుత్తునియలయ్యెను. దానికారాణి రోషకషాయిత నేత్రయై వీనిని వధింపుడని పరిచారికల కాజ్ఞాపించెను. చెలికత్తె కరవాలము విసరగ నది ఖండఖండములయ్యెను. కరవాలము పూలదండగా మార రాణి యాశ్చర్యచకితయై యితడెవడో మహాత్ముడని యెంచి పాదములపైబడి క్షమింపుడని ప్రార్థించెను. ఆమె యంతతో బోక రవివర్మపై మనసునిలిపెను. అతడంగీకరించి తానురాజై నిత్యానందుని కారాగారమునుండి విడిపించి రాణి తిలోతలతో నంతిపురికేగి సుఖంబుగ నుండెనుండెను.

కాంభోజాధీశుడు తిలోతలచే పరాభూతుడై పోయి తిరిగి ససైన్యముగవచ్చి కోటముట్టడించెను. అవ్వార్త నామెకు పరిచారికలు తెలుప

తన సైన్యమునంతను యుద్ధమునకు సిద్ధముకానాజ్ఞయిచ్చి యానమా చారము రవివర్మ కెఱుకపఱచి కర్తవ్యమేమని భీతితో నడిగెను. రవి వర్మ తిలోత్తల కభయహస్తమిచ్చి శత్రువులు కోటప్రవేశింపగనే, "జై అఖిలరంజన్" అను మంత్రము నుచ్చరింప శత్రుసైన్యములన్నియు నెక్కడివక్కడ నిలచిపోయినవి. ఆయుధహీనులై యుద్ధవీరులు చైతన్యము లేనివారైరి. కాంభోజాధీశుడు రాణిని శరణాందెను. రవివర్మను ప్రార్థించెను. అతడు దయార్ద్రహృదయుడై కొన్నిబీజాక్షరము లుచ్చరింప కాంభోజుని పరితాపమడగి యతని సైనికులందరు పునర్జీవితులైరి. ఆరాజు తనజీవితమందెప్పుడును రాణియెడ ద్వేషభావము చూపనని బాసచేసెను. రవివర్మ యతనికి స్వదేశమునకేగ నాజ్ఞయిచ్చెను. ఆన మయమునకే గురుశేఖరుండగు రవివర్మ నన్వేషించు పూర్ణానందుడు శిష్యసమేతముగ కాంభోజాధీశున కెదురుపడిరి. తనకు తిలోత్తలవలన పరాభవమగుటకు హేతుభూతుండు సన్యాసియేయని యనుమానమంది యట్టి సన్యాసులైన పూరానందాదులను హింసింపుమని తన సైనికుల కాజ్ఞయిచ్చెను. సైనికులు సన్యాసులమీాది కశ్వములనుదోలి త్రొక్కిం పయత్నింపగా పూరానందుడు "జై అఖిలరంజన్" అనగానే యశ్వము లన్నియు నేలపైబడి గిర్గిర దిరుగసాగినవి. కాంభోజాధీశుడు మిగుల భయమంది పశ్చాత్తప్తుడై పూర్ణానందుని రక్షింపుమని ప్రార్థించెను. ఆసన్యాసికి జాలికలిగి ప్రతిమంత్రము నుచ్చరించి యశ్వములను జీవింప జేసెను. ఆరాజు పూర్ణానందునకు నమస్కరించి తిలోత్తల వృత్తాంత మును, రవివర్మ యచ్చటనుండుటయు రాణి యాతనిని పెండ్లాడతలం చుటయు నెఱుకజెప్పెను. అవ్వార్త విని పూర్ణానందుడు మహదానంద మున రాజధాని కరిగెను. రవివర్మ తిలోత్తలయం దప్పటికొక కుమారుని గనెను.

రాణి తిలోతల యేటేటఁజేయు వసంతోత్సవము లానాఁడే ప్రారంభమగుట పురమంతయు నలంకరింపబడెను. పూర్ణానందుఁడా నగరరామణీయత కచ్చెరువందుచు రాజభవనమునకు బోవుచుండ వికృతాకారుఁడగు నొక ద్వారపాలకుఁడతని నడ్డెను. ఎంత బ్రతిమాలినను లోనికి విడువలేదు. అపుడు పూర్ణానందుడు, నేను గురుదర్శనము చేయకపోయిన మరణింతును. నన్ను చంపుమన నాసేవకుడట్లుచేయ సమ్మతింపడయ్యె. అంత నతడు 'జై అఖిలరంజన్' అనగానే యాభటుని దేహమంతయు వృశ్చికమయమై బాధనందసాగెను. మఱియొక మంత్రము నుచ్చరించి వానిబాధను పూర్ణానందుడు పోద్రోల నతడు మహానుభావుడని మొరిగియు ఖడ్గముతో బొడిచెను. అంత నాయోగి జై అఖిలరంజన్ అనగానే తిరిగి శిరసు మొండెము కలిసినవి. ద్వారపాలకుడపుడు పారిపోయెను. పూర్ణానందుడు మాఱువేషమున రాజభవనంబునకేగి వసంతోత్సవముల కానందించు రవివర్మనుగాంచి దగ్గరకేగుచుండ నతనివలెనే వివాహితుడైన నిత్యానందుడు నీవెవ్వండవని పూర్ణానందునడుగ నతడు నేనొక గాయకుడనని చెప్పెను. నిత్యానందుడా గాయకుని రాజసమక్షమునకు గొంపోయెను. అపుడు పూర్ణానందుడు యోగిచిహ్నము లేమియులేక రాజచిహ్నములతోనున్న రవివర్మను, అతనికి వామపార్శ్వమునున్న తిలోతలనుగాంచి యాశ్చర్య చకితుడయ్యెను. అచ్చట కొందఱు రమణీమణులు నాట్యము సేయుచుండిరి. కొందరు వసంతమును జల్లుకొనుచుండిరి. అపుడు నిత్యానందుడెవడో గొప్పగాయకుడు వచ్చెనని రవివర్మకు దెలుప నతనిని వెంటనే సభలో ప్రవేశపెట్టుమని యాజ్ఞాపింప పూర్ణానందుని రాజసభలో ప్రవేశపెట్టెను. అతడు సభలోగూర్చుండి యత్యంత మృదుమధురంబగు నొకకీర్తనను బాడెను. ఆకీర్తనయొక్క భావము, "రాజా! పూర్వాశ్రమంబున గొప్పతపశ్శాలివై యుండి యిట్లిపుడు మాయా మోహమునబడి మమ్మందఱను చుల

కనజేయుట భావ్యమా ! సౌందర్యభోగము లశాశ్వతములు, ఐహిక సుఖము క్షణభంగురము. జీవితకాలము స్వల్పము. తాము మోక్షా పేక్షవీడి మోహాపేక్ష నందవచ్చునా " యని యేయున్నది. ఆ కీర్త నను రాణివిని యీ వేదాంతములకులోంగి తనరాజు మరల నరణ్య ముల కేగునేమోయని భీతినంది, ఇతనిగానము నాకు రుచిగాలేదు. ఇటనుండి పొమ్మనుడని పలికినది. అంత పూర్ణానందుడు, రాణీ ! గానము శ్రోత్రతాన్రినందను చేయకున్న మృదంగమును వాయింతునని మృదంగముపై పూర్ణానందం, పూరానందం, అని ధ్వనించునట్లు మోయించెను. ఆ వాద్యధ్వని కలవాటుపడిన రవివర్మ 'పూర్ణానందా' యని కేకలుపెట్టెను. రాణి యాకేకలనువిని కంగారుపడి పూర్ణానందు నిపై గుప్తఖడ్గమును విసర నది నిరపాయమైనది. అంత రవివర్మ పూర్ణానందా ! నిన్నుజూచి చాలకాలమైనదని యాలింగన మొనర్చి రాణి తిలోత్తలతో నితడు నా శిష్యుండని చెప్పెను.

పూర్ణానందుడు, స్వామీ ! ఇకనైన తాము మరలిరారా యని ప్రశ్నింప వసంతోత్సవములు ముగియగనే వత్తునన పూర్ణానందుడం దుండి బయలుదేరి శిష్యులం గలసికొనెను. వసంతోత్సవములు ముగిసిన వెంటనే యతడు మరల రవివర్మను దర్శించి, గురువర్యా ! ఆశ్రమము నకు రారా యన నతండు నాకింకను సంసారవ్యామోహము తగ్గలేదు. నా కుమారుని జంపుమనెను. పూర్ణానందుడట్లొనర్ప తిలోత్తల దుఃఖిం చెను. ఆ రాజ దంపతులు కుమారుని బ్రతికింపుమని పూర్ణానందునివేడ, నీపతిని విడతువేని నీసుతుని బ్రతికింతుననెను. ఆమెకు పతినివిడనాడ మన సొప్పలేదు. కుమారుని బ్రతుకుపై నాసవదలలేదు. అదిగాంచిరవివర్మ, నీ తలచినప్పుడెల్ల వత్తును. నన్ను విడువుము. కుమారుని రాజ్యాభిషే కమునకు తప్పక వత్తునని యామె నంగీకరింపజేసెను. పూర్ణానందుడు కుమారుని బ్రతికించెను. తిలోత్తలా రవివర్మ లొకరి నొకరు విడువలేక

విడచిరి. రవివర్మ పూర్ణానందులు బయలుదేరి చాలదూరము నడచి వచ్చిరి. అంత రవివర్మ శిష్యుని చేతికొక బంగారుయిటుకనిచ్చి, స్నానముచేసి వచ్చువఱకు దీనిం బట్టుకొని యుండుండుమని నదికేగెను. పూర్ణానందుడిది హృదయ చలనహేతువుగాన దీనిని విడువవలెనని నదిలో నాయిటుకను బాఱవైచెను. రవివర్మ స్నానాంతరము తిరిగివచ్చి యిటుకనిమ్మనెను. శిష్యుడు నదిలోబాఱవైచితిని. అది మన కేల? తాము కాంతాలోలతవీడి కనకముపై నాస బడుదురాయనెను. అపుడు రవివర్మ, ఆ యిటుక పోయిన విచారములేదు. కావలసిన పర్వతమంత బంగారము తెప్పింతునని యటనున్న పర్వతముమీద దృష్టినిలుప నది కనకమయమయ్యెను. రవివర్మ యంతర్ధానుడయ్యెను. పిదప పూర్ణానందుడు విపరీత చింతుడై రవివర్మ నన్వేషింపుచు నాశ్రమమునకు వచ్చెను. అటనున్న శిష్యులను పూర్ణానందుడు చూచి, మిత్రులారా! గురువర్యుని పలుకట్టములుపడి వెదకి పట్టుకొని మోహజాలమున జిక్కిన నాని విడిపించి తెచ్చుచుండ నంతర్ధానుడయ్యెనని పలుక వారందఱు పరిహాసించిరి. పూర్ణానందుడంత కోపోద్రిక్తుడై యాశ్రమములోనికిబోవ రవివర్మయట నిష్ఠాగరిష్ఠుడై కన్పట్టెను. స్వామీ! తామువచ్చియెంతసేపైనదని ప్రశ్నింప గురువరుండు, అమాయకుడా! మన మిరువుర మెచ్చటికిబోక నిందే యున్నారము. నీవు చూచినదంతయు మాయయే. మాయామోహ మిట్టిదేనని నీకు జూపించితిననెను. పూర్ణానందుడాశ్చర్యచకితు డయ్యెను.

ఈ కథ ముగింపగనే ఫల్గునుండు, బావా! ఈకథయు నత్యంత రసోద్రిక్తమై యున్నది. నిద్ర వచ్చుచున్నది. నేటికి నిదురింత మని నిద్రించిరి.

---

## అయిదవరాత్రి కథ.

ఐదవనాటి రాత్రి కృష్ణార్జునులు యమునాస్రవంతీసికతటంబునఁ గూర్చుండి తన్నదీతరంగ మర్మరధ్వని నాలకించుచు పరిశాంతచిత్తులై యుండ నర్జునుండు, బావా! నేఁడుగూడ నొక యమూల్య విషయిక మగుకథ జెప్పుమని యడుగ పుండరీకాక్షుండిట్లు చెప్పనారంభించెను.

## 5. రాజహంసుని కథ.

తొల్లి కాంభోజదేశము నేలుచుండిన శశివర్మ మహారాజునకు పట్టపుదేవియగు సుకన్యాదేవియందు చిత్రాశ్వుఁడు, చిత్రకేతుఁడు, చిత్రరథుఁడు, రాజహంసుఁడు నను నల్వురుపుత్రు లుదయించిరి. రాజు వారిని సకలవిద్యావిశారదులనుజేసి మొదటి మువ్వురకును మత్స్య, కళింగ, పాండ్యదేశాధీశుల తనయలను వివాహమొనర్చి, రాజహంసునకుఁగూడ పెండ్లిచేయ దలంచి నానాదేశాధీశుల పుత్రికల చిత్రపటములదెప్పించి చూపెను. రాజహంసుఁడు తనకు వారిలో నేరాజపుత్రియు నచ్చలేదనియు నిపుడేమితొందర వచ్చినదనియు, నేనే స్వయముగా నచ్చినకన్నెను పెండ్లాడుదుననియు జెప్పెను. రెండువత్సరము లిట్లు గడచెను. రాజహంసుడు వివాహప్రసక్తియే తలపెట్టఁడు. అంద రాతనిని పెందలకడ వివాహమాడుమని ప్రోత్సహించి నిర్బంధించుచునే యుండిరి. రాజహంసుడు తన వివాహమునుగూర్చి వదినెలెట్టి యభిప్రాయమందుచున్నారో యని యొకనాటి మధ్యాహ్నమున మువ్వురు వదినెలు ముచ్చలాడు చావడికి వెనుకగదిలో గూర్చుండెను. అంత మొదటివదినె తక్కినవారితో, సోదరీమణులారా! మన మరది రాజహంసుడు కూడ పెండ్లాడిన నలువుర మొక్కచో హాయిగ నుందుముగదా యనెను. అపుడు రెండవయామె, అక్కలారా! అదేమి చిత్రమో గాని మనమరది కెందఱు రాజపుత్రికల చిత్రపటములను దెచ్చినను

నచ్చుట లేదనెను. మూడవయామె, మన మరదికి దేవకన్యవలె నుండు వంగనామణి కావలెను కాబోలు. నాకు పెద్దతండ్రియు, మగధ దేశాధీశుడునైన విజయపాల నృపాలుని కుమార్తె చక్కనిది కలదు. ఆమె సౌందర్యమును వర్ణింప నాయాదిశేషుడే చాలడు. ఆమె పేరు అలివేణి. ఒక రాక్షసి యామె చక్కదనమునుగాంచి యెత్తుకొనిపోయి పెంచుకొనుచున్నది. ఆమె లభించిన తప్పక పెండ్లాడు నన్నది. అంత రెండవ యామె, రక్కసి యామె నెచటదాచినదో యెట్లులభించునని ప్రశ్నింప మూడవయామె, ఆరక్కసి మాండలిక ద్వీపమందున్నది. ఆసంగతి మాపెదతండ్రిచివి మాంత్రికులను బిలిపించి యెట్లయిన తనయను దీసికొని రాయత్నించెనుగాని సాధ్యపడలేదు. ఆభూపాలుడు చేయునది లేక యూరకుండెనని బదులుచెప్పెను.

రాజహంసుడు మాటుననుండి యమ్మాటలనువిని అలివేణి నెట్లయిన పెండ్లాడవలెనని తలంచి బహు ప్రయత్నములుచేసి యామెలభించుట కష్టమనియెంచి వైరాగ్యముబూని కాలము గడపనెంచి తలిదండ్రులతో, నాకునచ్చిన రాజపుత్రికను న్వయగా గ్రహింపబోయెదనని వారికడ సెలవంది బహునదీనదనిపినభూములందాట తుదకు గౌతమ మున్యాశ్రమమునకుఁజేరి, యా మహర్షికి నమస్కరించి తాను వైరాగ్య ముఁబూనదలంచితినని చెప్పగా నమ్మునిపుంగవుడు, ముందుగ దపోనియమమందలి కష్టములనుగూర్చి రాజపుత్రునకుజెప్పి వారింపయత్నించెను. కాని రాజహంసుఁడు సన్యాసాశ్రమము నెడ తనకున్న ప్రబలాసక్తిని వెల్లడించెను. అంత గౌతముండు, రాజపుత్రా! నీ బుద్ధికిని పట్టుదలకును సంతసించితి. నీకు పరమనిగూఢంబగు తారకమంత్ర ముపదేశింతును. దానివలన సకలశుభంబు లొనగూడును. తారకమంత్రమున ప్రణవము. ఆ ప్రణవమున, అకార, ఉకార, మకారము లుదయించెను. అవియే త్రిమూర్తులు. అంతేగాక ఆత్మారాముడు వాయువుమూలమున

దేహమునందుజొచ్చి రాత్రింబవళ్ళారోహణావరోహణంబులచే సూర్య చంద్రనాడులందు దినమునకు 20206 పర్యాయములు కొట్టుకొనును. దీనినే ప్రణవమని తారకమంత్రమని యందురు. సకారోకారంబులను రెంటితో గూడిన హకారంబను నక్షరద్వయమును నిడా పింగళనాడులలో దిరిగి గాలిచే జిహ్వాబంధనముగావించి జపింపుమనెను. రాజహంసు డట్లేచేసి తారకమంత్రమహిమంబునెఱింగి యమందానందమందెను. రాజహంసుని నిశ్చలచిత్తంబునకు మెచ్చి పాకశాసనుం డతని కభీష్టసిద్ధి గల్గించుతలంపున నొక దివ్యాశ్వమునంపెను. గౌతముడా యశ్వమును తిలకించి దివ్యదృష్టినిజూచి, దీని నింద్రుడు రాజహంసునకై పంపెనని యెఱింగి, రాజహంసా! నీ మనసునందలికోరిక దెల్పుమన నతండు మాండలికద్వీపమందలి రక్కసిచే పోషింపబడు మగధరాజనందన యగు నలివేణినిగోరి తమకడకువచ్చితి నదియే నా యభీష్టమనెను. గౌతముం డప్పుడు, వత్సా! నీవు ధన్యుండవు. ఇంద్రుడు నీకై యొక దివ్యాశ్వము నంపెను. దీని నధిష్ఠించి యా ద్వీపమునకుబోయి యలివేణిం బెండ్లియాడి రమ్మని దీవించెను.

రాజహంసుండు గౌతమునకు బ్రణమిల్లి సెలవంది దివ్యాశ్వము నధిష్ఠింపగా నది వాయువేగమనోవేగంబులతో బయనించి మాండలిక ద్వీపమందలి రక్కసి సౌధాంగణమున నిలచెను. ఆ దివ్యసౌధంబుమహో న్నతమై యత్యంతమనోహరమై బాలభాస్కరదీప్తినిమించి ప్రకాశించు రత్నప్రభలతో మెరయుచుండుటకు రాజపుత్రు డాశ్చర్యపడి సాహస మున లోపలఁ బ్రవేశించెను. లోపలచావడిలో నిద్రించు రక్కసిని జూచి మానవమాత్రుండనగునేను దీని నెట్లు చంపగలుగుదునని యాలో చింపుచునే ముందునకు నడచెను. అల్లంతదూరమున హంసతూలికా తల్పముపై శయనించియున్న యలివేణి కన్పట్టెను. అత డామె చక్క దనముంజూచి మూర్ఛాక్రాంతుడయ్యెను. ఆ తల్పమున కనతిదూర

ముందున్న పంజరములోనిశుకి యలివేణిఁ గాంచి, అక్కా! మనయిక్క
కెవడో యొక్క బక్కమానవుడు వచ్చి నీ సౌందర్యమునుగాంచి మూర్ఛ
నందినాడు. శైత్యోపచారములచే సేదదీర్పుమని మధురముగ బలుక
నయ్యలివేణి దిగ్గునమంచముడిగివచ్చి యతనికి శైత్యోపచారముల
గావించి సేదదీర్చెను. రాజహంసుడు సేదదీరినవెంటనే తన వృత్తాంత
మును సాంతముగ నలివేణి కెఱిగించెను. పంజరమందున్న శుకమా
వృత్తాంతమంతయు నాలించి, అక్కా! నీ పినతండ్రికూతు నీ రాజ
పుత్రుని సోదరునకేయిచ్చి వివాహమొనరించిరి. అందుచే నీతడు నీకు
వరుసయగుబంధువు. కాంభోజాధీశుని పుత్రుడు. పేరు రాజహంసుడు.
నీకుదగినయందగాడు. నీపై వలపుదగిలి సాహసమున నింతదూరమేతెం
చినాడు. అని పలుక నా యలివేణి, ఓ చిలుకా! వెఱ్ఱితల్లీ! నీ వంతయు
నెఱిఁగి యిట్లు మాటాడుచున్నావే? నీ మాటలన్నియు నా కానందదాయ
కములైనవి. నే నస్వతంత్రను. రక్కసి వశురాలను. ఇతనిని పెండ్లాడి
యెట్లు రక్షించుకొనగలనని పలికెను. అపుడు చిలుక, అక్కా! రక్కసి
యాహారసంచారమునకు బోవునంతవరకు గాపాడుము. పిదప యాలో
చింతమనెను. ఇంతలో రక్కసిలేచి యలివేణిని బుజ్జగించి ముద్దాడి సం
చారమునకేగెను. తోడనే యలివేణి రాజహంసుని పన్నీటజలక
మాడించి పీతాంబరములుకట్టనిచ్చి షడ్రసోపేతభోజనమిడి తమలమిచ్చి
సరసల్లాపములాడుచు నతనితో భోగక్రీడలదేలియాడెను. కొలదిదినము
లిట్లుగడువ రాజహంసు డలివేణింగాంచి, ప్రాణేశ్వరీ! నీ కూడికవలన
నా కితరారాటము లెవ్వియులేవుగాని యీ రక్కసిభయంబుచే గలుగు
నారాటమున నా మనంబు మిగులనాందోళనమందుచున్నదని పలికెను.
అప్పలుకుల కలివేణి యులికిపడి చిలుకతో నా సమాచారముజెప్పగా
నది, అక్కా! అతడు మిగులసాహసవంతుడు. అయిన నీ యారాట
ముండుటవింతగాదు. కాని మీ యిరువురకు నీ దీవినుండి ముక్తిగావలె

నన్ను రక్కసిమరణమొక్కటియే యుపాయము. దాని యసువుల నెచ్చటనో గుప్తించియుండును. ఆ గుట్టు నీ వెరింగితివేని యీ రట్టు దీరిపోవును. అని పలుక నాటిమిట్టమధ్యాహ్నమున నలివేణి రక్కసి యాహారమును భుజించి నిద్రనుండి లేచువరకు విచారమభినయించుచుండెను. రక్కసి యదిగాంచి, తల్లీ ! నీ వెందులకు దుఃఖించుచుంటివని ప్రశ్నింప నా యలివేణి, అమ్మా ! నీవు నిరంతరము సంచారముచేయుచుందువు. నాకు నీ కన్న దిక్కుగాని ప్రేమాస్పదులుగాని లేరు. ఆ సంచారకాలమున నీ కెట్టియాపదగలుగునోయని నా మనం బెల్లప్పుడాందోళనాయుత్తమై యుండునని దుఃఖముతో కన్నీరుగార్చుచు పలికెను. రక్కసి యప్పలుకులువిని, అమ్మా ! నాకేమియు భయములేదు. నాకెవరివలనను నాపదరాదు. దానికొక రహస్యంబుగలదు. నా ప్రియపుత్రివగుట నీకు జెప్పుచుంటిని. నా ప్రాణముల నైదింటిని తుమ్మెదలుగనొనర్చి వాని నొక బరిణెలో బెట్టి యిచ్చటకు బదిమైళ్ళదూరముననున్న తాళవృక్షమందు వసించు చిలుక వశమందుంచితిని. భయమువలదని చెప్పి సంచారమున కేగెను.

రక్కసి సంచారమునకుపోగానే రాజహంసుడు, అలివేణియు, చిలుకయుగలిసి యా బరిణెందెచ్చు నుపాయముంగూర్చి యాలోచించిరి. తుదకు చిలుక, అక్కా ! నేను నోట బరిణెను గరచుకొనుట కభ్యసింతును. పిదప దానిం దెత్తును. మన రాజహంసుడు వానిం జంపును. మనయాపదతీరునని నాటినుండి పదిదినములు నోట బరిణె గరచుట నభ్యసించి యలివేణితో, నేను బరిణెను గొనిపోగలను. నన్నంపుమని యామెకడ సెలవంది బరిణెను నోట గరచికొని రక్కసి చిలుకయున్న తాటిచెట్టుకడకరిగి దానింగాంచి, మామా ! క్షేమముగానుంటివాయని యడిగెను. ఆ రక్కసిచిలుక యలివేణిచిలుకంగాంచి, తన జాతిచిలుక చాలకాలమునకు గనబడినందున సంతసించి క్షేమమడిగి

నన్ను మామామాయని పిచిలితివేలయని యడిగెను. అంత యలివేణిచిలుక నీవు నా తల్లికి సోదరుండవు. మనము విడిపోయి చాలకాలమైనది. ఇట నున్నట్లు తెలిసి యీ బరిణె నానవాలుగనిచ్చి నీ క్షేమమెరింగి నీ కడ నుండి యేదైన ఆనవాలు తెమ్మనిపంపినదనగా రక్కసిచిలుక విశ్వసించి యలివేణి శుకమునకు మూతఫలంబుల ఫలహారమిడి గౌరవించెను. ఫల మును దెచ్చుటకు రక్కసిచిలుక కొంచెముదూరమరిగిననమయమున అలివేణిచిలుక బరిణేనుమూర్చి రక్కసి ప్రాణాధారంబులగు తుమ్మెద లున్న బరిణెనుగ్రహించి తనమామయిచ్చిన ఫలములలో నొకదానిని భుజించి రెండవదాని నానవాలుగగైకొని నెలదినములలో తిరిగివత్తునని పలికి గిరుక్కున వెనుదిరిగి తనకొఱకు బెంగనందియున్న యలివేణి రాజ హంసుల మ్రోల వ్రాలి బరిణె వారియెదుటనుంచి, రాజహంసా! బరిణె తెరచి యొక్కమారుగ నా భ్రమరముల నైదింటిని జంపుమన నత డట్లుచేసెను. రక్కసి యా ద్వీపమంతయు వణకునట్లు ధ్వనిజేయుచు విలవిలదన్నుకొని చచ్చెను. అచట శుకంబుకూడ ప్రాణంబులు విడ చెను. మరుక్షణముననే యా సౌధమందున్న భాగ్యరాశులనన్నిటినిగొని రాజహంసు డలివేణితోను, చిలుకతోను, దివ్యాశ్వమునెక్కి బయలు దేరి గౌతముని యాశ్రమంబుచేరి యమ్మునిపుంగవు నాశీస్సులంది యతి రయంబున కాంభోజదేశమును చేరెను. రాజహంసుని భార్యాయుతు డుగగాంచిన తలిదండ్రులును, వదినెలన్నలును మహదానందభరితులై రని చెప్పెను.

ఇట్లు కథను కృష్ణుండు ముగింపగా, బావా! నేడు చెప్పినకథ చాలబాగున్నది. ఇంక నిద్రింతమని నాటికి నిద్రాముద్రితులైరి.

---

## ఆరవరాత్రి కథ.

ఆఱవనాటి రాత్రి నరనారాయణ రూపులైన కృష్ణార్జునులు యమునానదీ సైకతస్థలమున పండువెన్నెలలో మలయమారుతము సేవించుచు విహారము సల్పుచుండ నర్జునుఁడు. భావా! మిగుల వేడైన వింతగల కథ చెప్పుమని యడుగ నారాయణుఁడు, అర్జునా! నేను జయవర్మ మహారాజుగాథ చెప్పెద నాలింపుము.

## జయవర్మ మహారాజు కథ.

పూర్వము విక్రమసేనుఁడనురాజు మాళవము నేలుచుండెను. అతనికి చిరకాలమువఱకు సంతతి లేకపోయెను. అతనికిరువురు భార్యలు. చాల కాలమునకు వారిరువు రంతర్వత్నులై జయవర్మ జయచంద్రులను పుత్రులను వరుసగాఁ గనిరి. అందు జయవర్మ మొదటిభార్యకును జయచంద్రుఁడు రెండవభార్యకును గలుగుటఁజేసి జయచంద్రునితల్లి తనపుత్రునకు రాజ్యపాలనావైభవ ముండదుగదా యని జయవర్మపైనను, అతని తల్లిపైనను ద్వేషము గల్గియుండెను. జయవర్మ జయచంద్రు లొక్కచోటనే పెరిగి యొక్కతావుననే విద్యలభ్యసించినను గుణములలోను చేతలలోను వారికి మిగుల భేదముండెను. జయవర్మ కరుణార్ద్రహృదయుఁడు. నిగర్వి. ఉపాయ చతురుఁడు. మతిమంతుఁడు. సాహసుఁడు. జయచంద్రుఁడు క్రూరుఁడును మదోన్మత్తుఁడును అసూయాపరుఁడును, వక్రబుద్ధియునై యుండెను. విక్రమసేనుని రెండవభార్యయగు సవితాదేవి తనచెలికత్తెతో కుమారునకు రాజ్యాధికారము వచ్చు నుపాయమేదైన చింతింపుమని బోధింప నామె యొక్క యుక్తితోఁగూడిన పన్నుగడ నిట్లుచెప్పెను. సఖురాలా! నీపుత్రుఁడు రాజు కావలెనన్న నేచెప్పినట్లు చేయుము. నీకేదో గొప్పవ్యాధి కలదనియు, దానికి పులిపాలు గావలెననియు నీభర్తను కోరుము. అంత నాతఁడు కొడుకుల నందులకై పంపును. నీపుత్రుని

పరిసర గ్రామాదులందు గొల్లవాళ్ళు దగ్గిరకు వచ్చి లభ్యము కాలేదని చెప్పుమనుము. జయవర్మ భయంకరా టవులకరిగి యందు క్రూర మృగముల వాతంబడును. నీపుత్రుడప్పుడు నిరాటంకముగ రాజు కాగల డని చెప్పెను. సవితాదేవి యాచెలికత్తె మాటకు సంతసించి మఱు నాటినుండి భర్తను లాలించుచు కొన్ని దినములు గడపెను. ఇట్లు కొంత కాలమైన పిదప నొకదినమున సవితాదేవి భర్త తనసౌధమునకు వచ్చి నపుడు దుఃఖాక్రాంతయై ముసుగు బిగదన్ని మూల్గుచు పరుండెను. వీర సేనుడది గాంచి యామె ననేకవిధముల బ్రతిమాలి నీకోర్కె దెల్పు మనెను. అంతనామె, ప్రాణనాథా! నాకు చిన్నతనమునుండియు నొక వ్యాధి కలదు. నాతండ్రి చాలమందు లిప్పించినను తగ్గలేదు. ఇప్పుడు పులిపాలు పుచ్చుకొన్న తగ్గునని వైద్యులు చెప్పిరని పలికెను. అంత విక్రమసేనుడు, వనితామణీ! పులిపాలు తత్క్షణముగ తెప్పింతునని యామె నూరడించి, ఎవరు పులిపాలను దెచ్చిన వారికి పదివేలవరాల నిత్తునని తనదేశమంతటను చాటింపజేసెను. చాలమంది ధనాపేక్షచే నడ వులకు బోయి మరణించిరి గాని పాలు లభ్యముకాలేదు. రాజా సమా చారమును సవితాదేవికి జెప్పి విచారించుచుండ నామె, నాథా! ఆపులి పాలు తెప్పింపకున్న నాకు మరణము తప్పదు. మీరాడినమాట తప్పు ట పాడిగాదు. ఎట్లయిన తెప్పింపవలెను. దీనికింత యాలోచన నెందు లకు? మన బిడ్డలనుబంపిన తేగలరని వాక్రుచ్చెను.

విక్రమసేనుడంత తనపుత్రుల నిర్వురను బిలచి, విపినంబులకరిగి పులిపాలను దెచ్చినవారికి రాజ్య మిత్తునని చెప్పెను. జయచంద్రునకు సవితాదేవి తనసఖురాలు చెప్పినరీతి పదదినంబులు పరిసర ములందిరిగి పాలు దొరకలేదని చెప్పుమని బోధించుటచే నాతడు తక్షణమే పయ నమై పోయెను. జయవర్మకూడ నరణ్యమునకుబోవ సిద్ధగానుండ నతని తల్లియగు సునంద యుందు నిగూఢ మేదోకలదని సవతి పన్నుగడయని

యెఱింగి, నాయనా! నీవు పులిపాలు తెచ్చుటకు పోవలదు. నీకు రాజ్యం బువలదు. నీమేనమామ శుకపాలుండు విదర్భకేలిక. అతనికి పురుష సంతతిలేదు. చిత్రాంగద యతనికేకైక పుత్రిక. నీవచ్చుటకుఁబోయి యుండుమని వారించెను. జయవర్మ యావకులకులికి, తల్లీ! శౌర్య సాహస విక్రమాదులకు లక్ష్యంగా చతుస్సముద్ర ముద్రితమహీవల యంబుండ నేను విదర్భకు పోనేల? సుక్షత్రియ వంశమునబుట్టి ధను ర్విద్యాకుశలుండనై యుండి సోదరుడు జయచంద్రుఁడు కార్యసాధనకై విపినంబులకుఁబోవ నేనుపోకుండ నింటనుండుట మగతనమా? నాకుసెల విచ్చి పంపుము. అని యామెకు నచ్చజెప్పి భటచతుష్టయమును వెంట గొని సాంద్రారణ్యముల కరిగెను. జయచంద్రుడు పదిదినంబులందందు తిరిగి యింటికివచ్చి పులిపాలు లభ్యముకాలేదని చెప్పెను.

జయావర్మ సాయుధయోధ చతుష్టయంబులతో విపినంబుల దిరుగుచుండ నాభటులు మార్గము తప్పిపోయిరి. అతడొక్కండే మహా ధైర్యంబున వన్యఫలంబులందినుచు క్రూరమృగంబులను వధించుచు క్రమముగ హిమవత్పర్వతారణ్యంబులజేరి యటనున్న దేవాలయ మున విశ్రమించెను. సునందాదేవి యెన్నాళ్ళకును తనపుత్రుడింటికి రాకుందులకు విచారించి తన యన్నయగు శుకపాల మహారాజునకుధి అన్నా! నీమేనల్లుండు తండ్రియానతి నరణ్యంబులకు పినతల్లి వ్యాధి కుదుర్చుటకు పులిపాలను తేపోయి చాలకాలమై యింటికి చేరలేదు. అతని నెట్లయిన వెదకించి నేను మరల తెలుపువఱకు నీకడనే యుంచు కొమ్ము. అని యొక లేఖవ్రాయించి పంపెను. శుకపాలుడా లేఖంజూ చుకొని వివాహోచితవయస్క తనకూతునిచ్చి పెండ్లిచేయదలంచి యుండ నింతలో నిటులేఖ వచ్చెనేయని విచారించి నిజసేవకులను నలు దిశలకు జయవర్మ నన్వేషింప బంపెను. ఈసమాచారమును తన భార్య కును కుమార్తెకును దెలుప వారును మిగుల విచారించిరి. ఎంతకాల

మునకును జయవర్మజాడ తెలియనందున నొక కోకిలయంత్రమును నిర్మించి దానిలక్ష్యమును భేదించినవారికి తన కూతును రాజ్యముతో గూడ నిత్తునని చాటింపించెను.

జయవర్మ దేవాలయమున గూర్చుండియుండ నొక సన్యాసి వచ్చి జయవర్మ వృత్తాంతమరసి, నాయనా! ఈ యాలయమునకు వెనుకతట్టున నున్న సన్యాసిని జూడుము. అతడు దేవీప్రసన్నతకై పదుగుర రాజపుత్రుల నిదివఱకా దేవికి బలియిచ్చెను. ఇక నొక్కని బలియిచ్చిన దేవి ప్రసన్నురాలై యతని యభీష్టము లీడేర్చును. కావున నీవతనికి శిష్యునివలె నటించి మాయోపాయమున జంపుము. నీకు శుభంబగునని చెప్పి వెడలిపోయెను. జయవర్మ దేవీపూజచేయు సన్యాసికడకరిగి యతనికి శుశ్రూష లొనర్చుచుండెను. ఆసన్యాసి దేవికి బలియిచ్చుటకు కష్టపడకుండ పదునొకండవ రాజపుత్రుండు దొరకెనని లోలోన సంతసించుచు నొకదినమున జయవర్మం జూచి నీకేమి కావలెనని యడిగెను. పులిపాలు కావలెనని యతడు వచింప సన్యాసి పూజానంతరము నిమిషములో దెప్పింతునని వచించి యొకనాడు జయవర్మను కాళికాలయమునకు పూజార్థము రమ్మని చేకొనిపోయి దేవికి సాష్టాంగ నమస్కారమును గావింపుమనెను. అంత నారాజపుత్రుడు, ఆర్యా! నేను రాజపుత్రుండ నగుట నితరులకు నమస్కరించుట తెలియదు. ఎట్లో చూపిన చేతునన, సన్యాసి దేవికి సాష్టాంగపడ నా జయవర్మ యతని శిరస్సును ఖడ్గముతో నఱికెను. అంత కాళి ప్రత్యక్షమై రాజపుత్రా! నీసాహసమునకు యుక్తికి సంతసించితిని. పూజ సమాప్తిగావించి నిన్ను బలియీయ దలంచియున్న సన్యాసిని జంపితివి. నీకేమి కావలయునో కోరుకొమ్మనెను. అంత జయవర్మ, తల్లీ! నాతలంచినపుడెల్ల దర్శన మొసంగుము. మఱియు నేనీ సన్యాసిని జంపి బ్రహ్మహత్యా పాతకుండనైతిని. అప్పాపంబునశించి మోక్షప్రాప్తి యగుటకు మార్గముం జూపుమనీ వేడెను.

అంత కాళికాదేవి, రాకుమారా! వేదాంతరహస్యంబులలో నుత్తమంబైన సచ్చిదానందభావ మెఱిగించెద నాలకింపుము. సత్తు, చిత్తు, ఆనందము సచ్చిదానందమగును. ఆత్మకు సద్రూప చిద్రూపానంద రూపంబులని మూడు రూపంబులున్నవి, సద్రూపము నాదస్థూలంబులనియు, చిద్రూపమును తత్త్వరవి దువ్వలనియు, ఆనందరూపమును, అసికళలనియునందురు. ఈ స్థూలశరీర మిరువదిమైదు తత్త్వంబులుకలది. ప్రాణజ్ఞానేంద్రియములును పంచతన్మాత్రలునను పదునైదింటితోను, మనోబుద్ధులతోను సూక్ష్మశరీరముండును కారణపురుషుడు జ్ఞానముతో గూడిన చిత్తముకలవాడందురు. నొసట బీజము క్రంబయి వేయిదళంబులతో సహస్రారకమలమందుండి జపగాయత్రియని చెప్పబడును. సచ్చిదానందభావమిదియేయని వచింప జయవర్మ, దేవీ! ధన్యుండనైతి నని వచించి యారుమాసములా సచ్చిదానందభావమును జపించి యొక నాడు గిత్యాంతారణ్యమునకుబోవ కొందఱు బాటసారు లతనికి గన్పట్టిరి. మీ రెందేగుచున్నారని రాజపుత్రుడు వారినడుగ, వారు ఆర్యా! విదర్భరాజగు శుకపాలుని భటులము. వారి మేనల్లుండగు జయవర్మ యను రాకుమారు నన్వేషింపబోవుచున్నారము. అతడు పులిపాలను దెచ్చుట కరణ్యముకుబోయి మరలిరాలేదట. మా రాజకూతురైన చిత్రాంగదను పరిణయముచేయదలపెట్టియున్నాడని పలికిరి. జయవర్మ చిత్రాంగదకు తనయందు నిజమైనమక్కువకలదో లేదోయని పరీక్షింపదలచి కాళికను స్మరించి వృద్ధరూపముందాల్చి విదర్భకరిగెను. అట శుకపాలుడు నిర్మించిన కోకిలయంత్రమును భేదింపవచ్చిన రాజపుత్రులందరును దానినంకకైన తేరిచూడజాలక విన్నదనంబుననుండ వృద్ధునిరూపమునగున్న జయవర్మ తటాలునలేచి యంత్రమును లక్ష్యముచే భేదించెను. జగదేకలావణ్యవతియగు తనకూతును వృద్ధున కీవలసివచ్చెగదా యని శుకపాలాదులు చింతించిరి. చిత్రాంగద పూలదండ నా వృద్ధుని

కంఠమున నలంకరించెను. ఆ వృద్ధుఁడు తన నామధేయము గిరీంద్రచంద్రుడనియు గిరిదుర్గమునకు తా నధిపతిననియుఁ జెప్పెను. ఆ నాటిరాత్రి శయనమందిరమున తన్ను గలియవచ్చిన చిత్రాంగదతో, ప్రేయసీ! నీవా రూపయౌవ్వనవు. నేనో వృద్ధుండను వేరొకసుందరయువకుని పరిణయమాడరాదాయనియడుగ నామె, నాథా! ఇవేటి మాటలు? సకల భూపాలసమక్షమున మిమ్ము నువరించి మరల నిపుడెట్లన్యుని గోరుదును. ఇది కాంతాలలామకుదగునా? యని ప్రత్యుత్తరమిచ్చెను. మరల వృద్ధుండు, దేవీ! నీ వన్యథాతలంపవద్దు. మాళవరాజపుత్రుండగు జయవర్మను నీవు ప్రేమించి యుంటివని వింటిననిపలుక నామె మొగంబున విన్నదనంబుదోప, ప్రాణేశ్వరా! మా తండ్రి కతడు మేనల్లుడగుట ప్రేమించినమాట వాస్తవమేయైనను నతండు పులిపాలను దెచ్చుటకు పదినంబులకరిగి తిరిగిరానందున మా జననీజనకులును, అతని తలిదండ్రులును మిగులగుందుచున్నారు. ఇప్పు డన్యునిమాట నా కడనెత్తవలదు. తామే నా ప్రాణాధినాథులని చెప్పెను. అంత నా వృద్ధుండు, అతనిని దోడెత్తెచ్చి నీకు ముదంబుగూర్తుననెను. ఆ మాటలువిని చిత్రాంగద, మీ రిపుడు కంతుజయంత వసంతాదులను, కడ కింద్రునిదెచ్చినను నే నంగీకరింపజాల. అట్టి మాటలతో నాకు మనోవైకల్యంబు గలిగింపవలదు. నాకు మీ తోడిదేలోకము. నా కంటికి మీరు నవయౌవనులవలె గన్పట్టుచున్నారన తనయం దామెకున్న గాఢానురాగమునకును, ఆమె పాతివ్రత్యమునకును గిరీంద్రచంద్రుడు సంతసించి మరునాటిరాత్రి తనప్రాణేశ్వరితో నిట్లనెను.

ప్రేయసీ! నేను మృగయావిహారమునకేగి బహుకాలమైనది. రేపటిదినముననే వేటకుబోయివత్తునన నామె వలదనివారించెను గాని సూర్యు డస్తమింపకుండవచ్చెదనని బాసచేసినందున సమ్మతించెను.

మఱునాటివేకువ నాతడు నల్వురుభటులను వెంటగైకొని వేటకై పోయి చాలసేపువేటాడి వనాంతర్భాగమునకుబోయి యాభటులకు గానరాకుండ కాళిని స్మరించి నిజరూపంబుతో నొకవృక్షచ్ఛాయ నాసీనుడయ్యెను. శుకపాలుని భటులునల్వురును తమరేని యల్లుండగు వృద్ధరాజు కాన్పింపమికి భయపడి యందందుతిరుగుచు జయవర్మనుజూచి, అయ్యా! ఈ మార్గమున ధనుర్బాణములను చేతధరించిన వృద్ధక్షత్రియుడు చనుదెంచెనాయనియడుగ నావృద్ధు డింతకుముందే యొకభల్లూకము వాతబడెనని చెప్పెను. అంత నాభటులు, అయ్యా! తా మెవరు? అని యడుగ మాళవరాజపుత్రుండను. నా పేరు జయవర్మ. పులివాల నిమిత్తమై విపినంబులకువచ్చితినని పలుకగా, వారు అయ్యో! మీకై మా మహారాజెంతో కుందుచున్నాడు. నగరములోనికి బోదమురండని వెంటబెట్టుకొనిపోయి శుకపాలునకుజూపి మీ యల్లుండైన వృద్ధరాజు భల్లూకముచే జంపబడెనని చెప్పిరి. శుకపాలుడా సంతోషవిచారకర సమాచారములరెంటి నొక్కమారే విన్నందుల కాశ్చర్యపడుచు జయవర్మను గౌరవించి క్షేమమడిగి చిత్రాంగదకడకంపెను. అతడు భర్తృశోకమునగుందుచున్న చిత్రాంగదనోదార్చి, నన్ను పరిణయంబాడుమని వేధించి బ్రతిమాలెను. ఆమె నేనన్యుని చెట్టబట్ట నీవల్లనవచ్చునా? నుదుటివ్రాత నెవరు తప్పింపగలరు? నీ క్షేమమునుగూర్చి సరియైన నిర్ణయము దెలియకుండగనే నాకు స్వయంవరముజేయుట నా దురదృష్టము. ఇక నే నాలసింపక వనంబునకరిగి నా పతికాయము నన్వేషించి సహగమనమొనర్పబోయెదనని పయనమై విపినంబులకరిగి భర్తృదేహమునన్వేషింపుచుండెను. జయవర్మయు నామెకు దెలియకుండ వెంటనంటి యొకచోట కాళిని స్మరించి యింద్రరూపముదాల్చి చిత్రాంగదను సమీపించి, కోమలగాత్రి! నే నింద్రుడను. స్వర్లోకాధిపతిని. మృతిచెందిన వృద్ధపతికాయమన్వేషింపనేల? నన్ను వరింపుమని నామె

మండిపడుచు, ఇంద్రా! నీ పునర్వసుపర్వాధినాథుండవయ్యు మంచిచెడ్డ లెంచక పరకాంత నిల్లాసింపవచ్చునా? నీ వహల్యయెడ నవినీతిగవర్తించి నందులకుగలిగిన ఫలితమును మరచితికాబోలుననగా నతడంతర్హితుం డయ్యెను. అంతలో మరల చిత్రాంగదకు గిరీంద్రచంద్రుడు కట్టెదుర ప్రత్యక్షమయ్యెను. ఆమె మహదానందమున నాథుంజేరబోవ, నెచ్చెలి! ఇంద్రునివంటి భోగిని, జయవర్మవంటి సుందరయువకుని వలదంటివేల? అని ప్రశ్నింప, నాథా! నన్నిట్లు తరచితరచి పరీక్షించుచుంటిరేల? యని ఖిన్నురాలయగుటయు నా గిరీంద్రచంద్రుఁడు, దేవీ! నేనె జయవర్మను ఇన్నిరూపంబులను కాళిదయవలన ధరించి నాకు నీపైగల యనురాగ మును బరీక్షించితినని యమ్మూడురూపంబులను జూపి యామెను విస్మ యానందపరవశురాలిని గావించెను. చిత్రాంగదా జయవర్మలు నిజనగరి కరిగిరి. ఆమె జననీజనకులతో జరిగినదంతయు వచింప వారు మహదా నందమందిరి. వా రిరువురును గొంతకాలము విదర్భలో హాయిగనుండి పిదప మాళవమునకేగిరి. విజయసేనుఁడును సునందాదేవియు విపరీతా నందపరీతచేతస్కులై కొడుకును గోడలిని గౌగిలించి జయవర్మకు రాజ్యాభిషేకమొనర్చిరని కృష్ణుండు వచించెను.

కృష్ణుం డిట్లు కథముగింపగనే అర్జునుండు, బావా! నీవు కథ లనుజెప్పుటలో మిగుల నేర్పరివి. నేటికి నిద్రింతుమని పలికి నిద్రించిరి.



## ఏడవరాత్రి కథ.

ఏడవనాటి నిశాసమయంబున కృష్ణార్జునులిరువు రెప్పటియట్ల యమునాపరిసరంబునీతటమున గూర్చుండి పరసల్లాపములాడుచుండ నర్జునుండు, బావా! ఇంకొకకథ జెప్పుమన శ్రీకృష్ణుడిట్లు వచింప నారంభించెను.

## 7. విజయసింహమహారాజు కథ.

రఘునందనుండను రాజు తొల్లి సింధుదేశమును బాలింపుచుండెను. ఆ భూపాలునకు చంద్రసేన శూరసింహ విజయసింహులను మువ్వురు పుత్రులుకలరు. అందు విజయసింహుడు సకలవిద్యలందారితేరినవాడై, సుగుణరూప మతివిశేషములు కలవాడై, యుద్ధరంగమున విశేషించి శూరుడై, నిగర్వియై విరాజిల్లుచుండెను. ఆ దేశపుం బ్రజలాతని సుగుణంబుల శాశ్వ్యానంద మగ్నమానసు లగుచుండిరి. ఒకదినమున నా సోదరత్రయంబు వేటకై భయంకర కాంతారమున కరిగి వెన్వేఱ వేటాడుచుండిరి. అంతలో విజయసింహుడొక శార్దూలమును దఱుముకొనుచు బహుదూరమేగ నది యంతలో లేడియై చెంగుచెంగున దాటుచు నతనిని సమీపించుచు దూరమునకేగుచు నింకను చాలదూరము గొంపోవ నొక సౌందర్యవతియగు లలనామణి గన్పట్టెను. అంత విజయసింహుడు, తిలోదరీ! నీవెవ్వతవు? ఎందుకి యిటకువచ్చితివి? అని ప్రశ్నింప నామె, అయ్యా! నేను నాగేంద్ర తనయను. పుష్పాపచయంబున కీవనంబునకు వచ్చితిని. తమ బోంట్లే కాంత ప్రదేశముననున్న పరకాంతల నిట్లు బలుకరింప వచ్చునా యని యడిగెను. మరల విజయసింహుడు, కాంతామణీ! దైవీయంబగు నీచక్కదనంబునకే ముగ్ధుండనైతిని. నన్నువరించి సంతస పెట్టుమన నామె, ఆర్యా! నాజనకునాజ్ఞ లేక నేను నిన్నెట్లు వరింతును? అన్నసం

తినుగదా! యనెను. విజయసింహుడంత నతిదీనుడై, నీవెట్లొనరింతువో నన్నువరించి నాకానందము గూర్పవలెనని వేడ నామె, నీవు నిజముఁగ నాపై వలపునిలిపిన నావెంటరమ్ము. నీ యానందమే నా యానందము. నా తండ్రికడకేగి యనుమతిబడసి పెండ్లాడుదమని పలుక వారిరువురు దివ్యాశ్వంబులనెక్కి పయన మొనరించి యొక మఱ్ఱిచెట్టుక్రిందనున్న వల్మీకమును జేరిరి. ఆ నాగకన్య, రాజపుత్త్రా! నేవచ్చువఱకు నీవిచ్చటే యుండుమని వల్మీకము లోనికిబోయి యెంతకును మరలిరాలేదు. విజయసింహుడు విషాదాశ్చర్యమానసుడై విసిగి వెందిరిగి రాదలంచుచుండ నంతలో నొక సర్పమందుండి బయటికివచ్చెను. రాజపుత్త్రుండా యురగమునుజూచి భయాతిరేకమున పఱుగిడబోగా నాసర్పము మనుష్యభాషణంబులతో, రాజపుత్త్రా! వెఱవకుము. నేనొసంగు దివ్యశరంబు నందుకొని యిప్పుడే బర్బరదేశంబున కేగుము. ఆదేశాధిపతికి సూర్యకాంతయను పుత్త్రికగలదు. రాజామెకు బరిణయము గావింపనెంచి ఝల్లికాయంత్రమొండు నిర్మించి దానిని భేదించినవారికి తనయ నిత్తునని చాటించెను. నాయొసంగు దివ్యశరంబున నాయంత్రలక్ష్యమునుగొట్టి యామెను బెండ్లాడి యామెతో క్రీడింపక యా మధుపర్కంబులతోనే యిటకువచ్చి నావడగపై చేయిడిన నేను పాపవిముక్తి నందెదనని పలికి దివ్యశరంబిచ్చి పంపెను.

విజయసింహుడట్లే చేయుదునని నాగేంద్రునకు బాసయిచ్చి దివ్యశరంబుగైకొని దివ్యాశ్వమెక్కి బర్బరదేశమున కేగెను. విజయసింహుని సోదరులు తమ్మునిజాడ గానక వెదకుచు నొకచో యశ్వంబునుగాంచి తమ తమ్ముడు క్రూరమృగంబు వాతఁబడెనని విచారింపుచు నిజరాజధానింజేరి జననీజనకుల కవ్వార్త దెలిపిరి. వారును మిగుల దుఃఖాక్రాంతులైరి. విజయసింహుడు బర్బరదేశంబున కరిగి సకల జనసమృద్ధంబును, అఖిల రాజకుమార పరివేష్టితంబునగు స్వయం

వర మంటపమున కేగెను. అనేకులు రాజకుమారు లామంటపమునను ండియు నొక్కడును తద్యంత్రిమును భేదింప సమర్థులయ్యే. అంత విజయసింహుడవలీల నాగేంద్రదత్త శరమ్మును వింటసంధించి ఝిల్లికాయంత్రిలక్ష్యమును భేదించెను. వధూమణి యగు సూర్యకాంత విజయసింహుని కంఠమున పుష్పములంకరించెను ఆమె జనకుండును బంధుమిత్రాదులును మిగుల నానందించి మహావైభవముగ సూర్యకాంతా విజయసింహులకు బరిణయమహోత్సవమును గావించిరి. వివాహానంతర మొదటనాటిరాత్రి సూర్యకాంత రతదేవరమాదేవియో యనునట్లలంకరించుకొని శయనమందిరమున కరుదెంచెను. ఆ నూతన దంపతులు కొంతసేపు సరస సల్లాపంబు లాడికొనిరి. ఆ సమయమున విజయసింహుని నాగేంద్రునిమాట జ్ఞప్తికివచ్చి భార్యను తాకక నావృత్తాంతమంతయు నామె కెఱింగించెను. ఆమెయు నంగీకరించి వేరొక శయ్యపై నిదురించెను. ఇట్లు పదిమూడుదినములు గడువగా నొకనాడు విజయసింహుడత్తమామలకడ సెలవంది భార్యతో, బహుమానములతో సింధుదేశమునకరుగ పయనమై మార్గమధ్యమున నొకటి వల్మీకంబు కడకు వచ్చెను. అంతలో నాగేంద్రుడు వెలికిరాగా నాదంపతులాతని పడగపై హస్తములుంచిరి. ఆ నాగేంద్రుడంత నొక గంధర్వుడై చేతులు జోడించి, పుణ్యదంపతులారా! నే నొకప్పుడు భూలోకవిహారము సేయుచు నేమఋపాటున నొక మునితల్లజుపై ద్రాడు విసరితిని. అమ్మహాత్ముడు నాపై వలిగి సర్పంబుకమ్మని శపించెను. అప్పుడు నేను శాపమోక్ష మొసంగుమని వేడగా నాసుకృతరాశి దయదలచి, విజయసింహుడను రాజపుత్రునివలన నీకు శాపమోక్షంబగునని వ్రాక్రుచ్చెను. మీదయవలన పూర్వరూప మందితి. వర మొండు వేడు మనెను. విజయసింహుడు, మహాత్మా, వేదాంత సోపానమం దేడవదియగు భక్తియోగమును విశదీకరింప గోరుచున్నా డననెను.

ఆగంధర్వుఁడు, విజయసింహా! భక్తిలేని మానవుడు మానవుం డేకాఁడు. భక్తునకు దైవసాహాయ్యము కరతలామలకము. నిర్గుణంబును రూపహీనంబును నవినాశకంబునగు పరబ్రహ్మ పదార్థమును జపించిన వారే సుకృతాత్ములు. జ్ఞానమభ్యాసముకంటె నుత్తమము. దానికంటె ధ్యానము గొప్పది. ధ్యానముకంటె కర్మఫలత్యాగము గొప్పది. ఆసనము నభ్యసించి జపకుండలిని భేదించి సుషుమ్నా నాడింజేర్చి, అపానవాయువు గుదమందును, సమానవాయువు నాభియందును, ప్రాణవాయువు చిత్తమందును, ఉదానవాయువు కంఠమందును, వ్యానవాయువు కాయమందు నుండునుగాన ధ్యానమట్లు చేసిన నది భక్తియోగంబగునని పలికి యదృశ్యుఁడయ్యెను. విజయసింహుఁడు సూర్యకాంతతో నిజదేశమునకు వచ్చుచు మగధదేశమున నొకదినము విశ్రమింపనెంచి యాగెను. ఆసమయముననే మగధరాజేకైక పుత్రికయగు రూపలీదేవికి వివాహమునుఁజేసి రాజ్యమల్లునకే యీయఁదలంచి యొక పట్టపేనుగు నలంకరించి యది యెవనికంఠమున తన తొండమందున్న పూలదండ వైచునో వానికిత్తునని పూదండ కరిహస్తంబుననుంచి బంధుమిత్ర సామంతాముల తో రాజమార్గము వెంబడిని వచ్చుచుండెను. ఆగజేంద్రము విజయసింహుని గాంచినతోడనే పూదండ నాతని కంఠమున వైచెను. మగధరాజంత మహదానందమునొంది విజయసింహునకు తనకూతు రూపలినిచ్చి పెండ్లిగావించెను. విజయసింహుఁడట గొన్నిదినంబులుండి సూర్యకాంతా రూపలీదేవులతో సింధుదేశమునకు వచ్చెను. రఘునందన మహారాజు నతని పుత్రులు చంద్రసేన శూరసింహులును విజయసింహుఁడు కళత్రంబులతో వచ్చుట కాశ్చర్య సంతోష మగ్నమానసులైరి.

ఇట్లని కృష్ణుండు కథ ముగించినంతనే, బావా! కథ లిట్లుచెప్ప నేర్పుట నార్జించితివని పలికి యింక నేటికి నిద్రింతమన వారు నిద్రాదేవి యొడిలోఁజేరిరి.

---

## ఎనిమిదవరాత్రి కథ.

ఎనిమిదవ నాటిరాత్రి మామూలు ప్రకారముగ యమునానదీ కూలంబున కూర్చుండి మాటలాడు కొనుచుండ నర్జునుడు శ్రీకృష్ణుం జూచి, బావా! నేడు కూడ నొకకథ జెప్పుమని యడుగ వాసుదేవుండు చంద్రకేతు మహారాజుకథ నిట్లు చెప్పదొడంగెను.

## చంద్రకేతుమహారాజు కథ.

పూర్వము కొంకణదేశమును బాలించు విజయాంక మహారాజునకు సంతతి లేక లేక చిరకాలమున కొకపుత్త్రుండుదయించెను. అతనికి చంద్రకేతుండని నామకరణంబుచేసి తగిన గురులచే సమస్తవిద్యల నేర్పించుచు బాల్యంబుననే వివాహముచేయ తలంపున తనకు బంధుకోటిలోనివాడగు చేరదేశాధీశు గోపాలక మహారాజునకు నీకూతు జగదాంబను నాపుత్త్రునకిచ్చి పరిణయం బొనర్చుమని లేఖనంపెను. గోపాలక మహారాజు, నాతనయ యౌవనవతి కాగానే తప్పక పెండ్లి చేతునని ప్రతిలేఖ నంపెను. ఇంతలో విజయాంకుడు దుర్భర రోగపీడితుడై దివమలంకరించెను. ఆభూపాలుండు మరణకాలమున తన ప్రధాన సచివుండగు దుష్టబుద్ధిని చేరబిలచి, నా పుత్త్రుండు యుక్తవయస్కుడగువఱకు తగిన శ్రద్ధ వహింపవలసినదని పుత్త్రునితో గూడ రాజ్యమతని కప్పగించెను. విజయాంకుని మరణానంతరము దుష్టబుద్ధి రాజ్యాపహారణంబునకై కుట్రలు పన్నుచు నెట్లయిన తన పుత్త్రుండగు దుశ్శీలునకు చేర రాజపుత్త్రికను వివాహమొనర్చి కొంకణదేశమునకుం బట్టముకట్ట నిశ్చయించెను. అందుల కడ్డుదగులుదురేమో యని చంద్రకేతుని మాతృసహితముగ చట్టుబెట్ట నూహించి యొక యంతఃపుర పరిచారికకు లంచమిచ్చి పై వింకను నానబెట్టి యా తల్లి బిడ్డలను జంప గొంత విషపదార్థమును దానిచేతికిచ్చెను. ఆపరిచారిక విశ్వాసపాత్రురాలగుట

నాసమాచారమును రాణికిం దెలియఁజెప్పెను. చంద్రకేతుని తల్లి మంత్రి దురాలోచనగ్రహించి, యిటనున్న నెప్పటికైన తమకుముప్పు తప్పదని భయపడి రహస్యముగ కోశాగారమందలి ధనకనకాభరణాదుల నపరిమితంబుగా గైకొని చేరపట్టణమున కరిగెను. అందొక సౌధమున నామె తనబిడ్డతో వసింపుచు పుత్రుని విద్యావిషయమున కడు శ్రద్ధవహించి సకలకళా విశారదుండగు హరప్రసాద శాస్త్రియను చేర రాజ్యాస్థాన పండితున కొప్పగించెను. ఆ ప్రసాదశాస్త్రికడనే చేర రాజపుత్రి జగదాంబ విద్యనభ్యసింపుచుండెను. జగదాంబా చంద్రకేతుల కనతికాలములో మైత్రియేర్పడి యది యనురాగముగఁ బరిణమించుచుండెను. ఒకనాఁడు నూత్న యౌవనారంభమున నున్న జగదాంబ, నాఁడు తనకు పాఠములు రాలేదనియు, గురులు కోపింతురనియు, నాకా పాఠములను జెప్పుమనియు చంద్రకేతు నడిగెను. అంత నతఁడు, జగదాంబా! నీకు నేను పాఠములను జెప్పినందున నాకువచ్చు లాభమేమనెను? ఆ రాజపుత్రి, మిత్రమా! నీవేదికోరిన నదియే యీయ సిద్ధముగ నుంటినని బదులుచెప్ప చంద్రకేతు నామెకు పాఠములను బోధించెను.

ఇవ్విధంబున గొన్ని దినమ్ములవిక్రమించునప్పటికి కొంకణదేశపు మంత్రి చేరరాజునకు మారాజు మరణించెననియు నతని పుత్రుడు చంద్రకేతునకు మీరింతదనుక యిచ్చిన వాగ్దానప్రకారము మీతనయ జగదాంబను పెండ్లిచేయవలెననియు నందుకు దగునేర్పాటులు గావించిన రాజపుత్రుని తరలించుకొని వత్తుననియు గబురంపెను. గోపాలకవర్మ దాని కంగీకరించి కూతు మేడకరిగి, తల్లీ! నీవు పూర్ణ యౌవనవతివగుట బరిణయ మొనర్పనెంచితిని. ఇంక నీవంతఃపురము వీడరాదు. కాన నీగురునకేమి కాన్క లీదలంచితివో గురుదక్షిణగా నిచ్చిరమ్మనియు

నిన్ను కొంకణ రాజపుత్రునకు బెండ్లిచేయ నిశ్చయించితినని యు దెలిపెను. అంత రాచకన్న కొన్ని బహుమానములను గైకొని గురున కర్పించి చంద్రకేతు సౌధంబునకరిగి తనవివాహ సమాచారమును విద్యాభ్యాసావసానమును దెలిపెను. చంద్రకేతుండా సమాచారమువిని వెన్నువిఱిగి రాజపుత్రీ! ఒకనాడు నాచే పాఠములు చెప్పించుకొనునప్పుడేమంటివో జ్ఞప్తికి దెచ్చుకొనుము. మఱవలేనుగదా యనెను. ఆమె తన మిత్రునిగాంచి, నీ యుపకారమును నేను మఱతునా? నీకేమి వలయునో కోరుమన నతండు నిన్ను నామనఃపూర్వకముగ ప్రేమించి వాంఛించుచున్నాననెను. అపుడు జగదాంబ తనమనంబున, అయ్యో! నాతండ్రి కొంకణ రాజపుత్రునకు పెండ్లిచేయ దలంచెను. ఈతనిట్లు కోరుచున్నాడు. ఆడితప్పుట పాడిగాదు. అంతేగాక కొంకణ రాజపుత్రుడు కురూపియో, సురూపియో, కుంటియో, గ్రుడ్డియో నాకు దెలియదు. ఇతండు జగదేక సుందరుడు అని యూహించి, రాకుమారా! నీతో మైత్రికలసినది మొదలు ప్రణయరేఖ నాహృదయమున నుద్భవించినది. నేనాడినమాట తప్పను. కావున రేపురాత్రి కోటపడమర ద్వారమున వేచియుండుము వచ్చుటకు వచ్చెదను. సంశయింపకుము. అని నిజసదనంబునకరిగి యాకథనంతను తన ప్రియసఖితో జెప్పెను ఆసఖురాలు, నీవాతనితో నెటకైన పోయితివేని యది కళంకదాయకమగును. అట్టిచేతలు కూడవని బుద్ధిచెప్ప నేమేమో చెప్పి యామె నొప్పించి మఱునాటి నిశీధమున వలసినంత భాగ్యముతో దన సఖురాలి సాయమున నగర పశ్చిమద్వారమున కరిగెను. అందంతకుమున్నే చంద్రకేతువు రెండుత్తమాశ్వములతో బ్రయాణసన్నద్ధుడై వేచియుండెను. అంత నాయిరువురు నశ్వారూఢులై పోయి చాలదూరము పయనించి యొక యుద్యానవన సౌధమును జేరిరి. చేరరాజు కూతునకై వెదకించి విఫల మనోరథుడయ్యెను. కొంకణరాణికూడ కుమారునిగూర్చి పరిత

పించుచుండెను. జగదాంబా చంద్రకేతు లుద్యానసౌధమున హాయిగ నుండ నొకనాడు జగదాంబ ఖిన్నురాలగుట చంద్రకేతుడుచూచి కారణమడిగెను. ఆమె తనను కొంకణ రాజపుత్రునకు వివాహముచేయ నిశ్చయించుట మొదలగు సంగతులను జెప్పెను. చంద్రకేతుం డందులకు విపరీత మనస్కుడై చెలీ! వింతగా జెప్పుచుంటివి. నేనే యాకొంకణ రాజపుత్రుండను. నాతండ్రి మరణానంతరమున సచివుండగు దుష్టబుద్ధి నారాజ్య మపహరింపదలంచి విషం బొకదాసిచే పంప నాతల్లి యది గ్రహించి యీ దేశమునుండి రహస్యముగ తప్పించుకొనివచ్చి యీనగరమున నున్నాము. అనగా నీవిషయము నాతండ్రికి చెప్పిన మనకు దప్పక వివాహము చేసియుండుననగా, చంద్రకేతువు జగదాంబకా సౌధోద్యానంబుల ప్రకృతిని వర్ణించిచూపి గాంధర్వవిధిని పెండ్లాడ హెచ్చరించెను. ఆమె యంగీకరింప నందేయుండి యనంగక్రీడల దేలుచుండిరి.

ఇట్లుండ నొకదినంబున వారిరువు రుద్యానమున గూర్చుండ వృద్ధాంగన యొకతె వారినికటమునకు జగదాంబను తిన తనగాదలంచి నన్ను మోసపుచ్చి యిట కెట్లువచ్చితివని యడుగ నాదంపతులాశ్చర్య పడి, అవ్వా! మమ్మెవ్వరిగా దలంచితివని ప్రశ్నించిరి. అంత నామె నాతనయ మరణించినందున నట్టిభ్రాంతిపడి పొరపాటొనరించితిని. మీకభ్యంతరము లేనిచో మీయిరువురు నాసౌధమునకు నాభాగ్య మనుభవించుచు హాయిగానుండుడని బ్రతిమాల వారంగీకరించి యామెతో కళింగ రాజ్యమునకేగిరి. కళింగనగరమున వృద్ధాంగన సౌధమునం గూర్చుండి యుండగా జగదాంబ హఠాత్తుగ, అయ్యో! నిన్న యుద్యానవన చంద్రకాంత శిలావేదికపై నారత్నహారముంచి మరచివచ్చితి ననగా చంద్రకేతుడు దానిందెచ్చుటకు బయనమై వెళ్ళెను. అతడా యుద్యానసౌధమునుండి వచ్చుచుండ మార్గమధ్యంబున నారత్నహారమందు

డాగియున్న సర్పమాతని కంఠభాగమున గఱచుటచే నశ్వముపై మూర్ఛనందెను. అశ్వము పోయిపోయి యొక వారకాంత సౌధము ముందు నిలువ నాసౌధమున వసించు హంసనారి యను వేశ్య హాయంబుపై మూర్ఛపడియున్న సౌందర్యవంతుడగు రాజపుత్రునిఁగాంచి, మోహితయై లోనికిం గొనిపోయి శైత్యోపచారము లొనర్చి యాతనిని పరిపరివిధంబుల నన్నుఁ గలియుమని బ్రతిమాలినను చలింపడాయెను. అట కళింగనగరమున వృద్ధురాలి సౌధమందున్న జగదాంబ భర్తరామికి దిగులొంది దుఃఖించుచుండెను. హంసనారి తల్లి కూతుపై రాజకుమారుని నిమిత్తము ధనవ్యయము చేయుచున్నందులకు విసుగుకొనుచు నొక మాంత్రికురాలిచే మంత్రింపబడిన జలము నాతనిపై జల్లగా చంద్రకేతువు శుకరూపముం దాల్చెను. హంసనారి తల్లి దుష్కృత్యమునకెంతయోవగచి తల్లిని పలువిధంబుల తూలనాడెను. చంద్రకేతువు శుకరూపుఁడై సంచరింపుచు కళింగనగరమునకరిగి యటరాజాంతఃపుర సౌధమున వ్రాలెను. ఆ యంతఃపురినున్న కళింగరాజ పుత్రికయగు కృష్ణకుమారి యాచిలుక ముద్దుపలుకుల కలరి మెల్లగా పట్టుకొని శరీరము నిమురసాగెను. ఆ సమయమున చిలుక ఱెక్కలందున్న మైనపువెంట్రుక జారి క్రిందబడ చంద్రకేతువు స్వస్వరూపమునందెను.

కృష్ణకుమారి చంద్రకేతుని సౌందర్యమునకు మెచ్చి యతనిపై వలపునిలిపి పగలంతయు నతనిం జిలుకరూపమున నుండనిచ్చి రాత్రులం దతనితో నిష్టోపభోగంబుల దేలుచుండెను. మూడు మాసములు గడచువరకు కృష్ణకుమారి యంతర్వత్ని యయ్యెను. ఆసమాచారము రాజునకు దెలిసి యామెగుట్టు దెలిసికొన గూఢపరిచారికలను నియమించెను. ఆ పరిచారికలందరు వ్యర్థమనోరథులైరిగాని యందొకతె చిలుక రహస్యమును గనిపెట్టి రాజునకు దెలిపెను. మహారాజా చిలుకను తరిమెను. ఆ చిలుకలేనిదే నే నాహార మొల్లనని కృష్ణకుమారి పట్టుబట్టు

టచే రాజాచిలుకను బట్టుకొని మాంత్రికుల కాజ్ఞయిడెను. మాంత్రికు లలో నొకడు డేగరూపమంది యా చిలుకను దఱుముగా నది భయపడి శుంభమహర్షి యా శ్రీముముక్షువాని నిజరూపమునుధరించి మైనపు వెంటు్రికను వదిలపరచుకొని యామునివల్లభునకు నమస్కరించి, స్వామీ! మీరు కారణజన్ములు. నాకిట్టి కష్టంబువచ్చుటకు కతంబేమి యని యడుగ నామునిశేఖరుండు, రాజకుమారా! ఆత్మకు దుఃఖమాగంతు కము. దేహధారికి దుఃఖంబు తప్పదు. జ్ఞానవంతుడు విచారము నంతః కరణ ప్రవృత్తిగనెంచి నిరక్తితో జూచును. అజ్ఞాని యాదుఃఖము కష్ట ఫలితమని తన చెడ్డరోజులని సమాశ్వాసించును. ఆత్మారామ బ్రహ్మ మునే మాయ ని వచింతురు. నవరంధ్రయుత దేహమున సూర్యనాడి రక్తవర్ణముగను చంద్రనాడి శ్వేతవర్ణముగను నుండును ! ఆ యాత్మ బ్రహ్మమే యఖిలప్రపంచమును సృజించి తాను పరమాత్మ నామంబున నుండును. నాయనా! నీకై చేర రాజపుత్రిక మిగుల దుఃఖించు చున్నది. ఆమెకడకు వేగబొమ్మని చెప్పగా చంద్రకేతువు ముందు కళింగ రాజ స్థానమున కరిగి తన సమాచారముం దెలుప నారాజేంద్రుడు మిగుల సంతోషముతో కృష్ణకుమారినిచ్చి పరిణయంబొనర్చెను. చంద్రకేతువు కొన్ని దినంబులటనుండి కృష్ణకుమారితో వారకామిని యగు హంసనారి యింటికేగి యామెను తన వెంటబెట్టుకొని తిన్నగా వృద్ధురాలి మేడయందున్న జగదాంబకడ కరిగెను. అటనుండి జగదాంబా హంసనారీ కృష్ణకుమారికలతో చేర రాజ్యమున కరిగెను. తల్లిం జూచెను. ఆమె పొందిన యానంద మింతింతయని చెప్పనలవి కాదు జగదాంబ జననీ జనకులకడకుబోగా వారామెను ముందు నిందించి వృత్తాంతమంతయు విని సంతసించి రాజా జగదాంబా చంద్రకేతులకు బరిణయ మహోత్సవము గావించెను. ఇంతలో కొంకణదేశపు మంత్రి తన తనయునితోను, స్వల్పపరివారముతోను చేర రాజ్యమును జేరెను.

చేర రాజగు గోపాలకవర్మ దుష్టబుద్ధింగాంచి, ఆర్యా! మీరాకు మారు డేడీ యని ప్రశ్నింప తనకుమారు దుశ్శీలు నెదుట బెట్టి, రాజా! ఇతడే మారాజతనయుండగు చంద్రకేతుడు. ఇతనిం గరుణతో జూచు భారము నీదే యనెను అంత గోపాలవర్మ, అమాత్యశేఖరా! ఈ రాజపుత్రునితో తల్లి వచ్చియుండ లేదా? యని యడుగ నామె పతివియోగానల దందహ్యమానమానసయైయుండి వివాహమునకు రాజాలనన్న దనెను. చేర రాజా పలుకులకు రోషకషాయితాక్షుడై, ఓ మోసగాడా! ఇతండే నాచంద్రకేతువు! అట్లయిన నీత డెవ్వండని చంద్రకేతుని బిలిపించి చూపెను. దుష్టబుద్ధి గుండెలలో రాయిపడి నిశ్చేష్టుండయ్యెను. అంత గోపాలకవర్మ నీ దురాలోచన కిదియే శాస్తియని యతనిని చిత్రవధ చేయించి మంత్రిసూనుని కారాగారమున నుంచెను. చంద్రకేతువు కొంకణ దేశమునకు రాజయ్యెనని కృష్ణుండు చెప్పువఱకు నర్జునుండు, బావా! ఈగాధ చాల చిత్రముగానున్నది. నేటికింక నిద్రింతమని చెప్పి పరుండెను.

---

## తొమ్మిదవరాత్రి కథ.

తొమ్మిదవనాటిరాత్రి శ్రీకృష్ణార్జునులు యథారీతి యమునాతటంబున మందమారుతంబుల సేవింపుచు గూర్చుండ నర్జునుండు, బావా! నేడుకూడ నొకకథ చెప్పుమనియడుగ కృష్ణుండు విక్రమసేన మహారాజు కథచెప్పెద నాలింపుము.

## 9. విక్రమసేనమహారాజు కథ.

తొల్లి యంగదేశాధీశుండగు విష్ణుజిత్తునకు చిరకాలమున కొక పుత్రుం డుద్భవించెను. అతనికి విక్రమసేనుడని పేరుపెట్టిరి. అతడు జనించిన ముహూర్తమెట్టిదోకాని కొలదిదినములకే రణరంగమున తండ్రి మరణించుటయు రాజ్యము శత్రువశమగుటయు జరిగెను. విష్ణుజిత్తు మరణానంతర మాతని భార్యయగు రాజ్యాంబ కుమారు నొక రహస్య ప్రదేశమునకుగొంపోయి పెంచుచుండ నామెయు మరణించెను. అంత నా బాలుని విశ్వసనీయురాలగు నొక పరిచారిక పెంచుచుండెను. ఆ బాలుడు పసితనముననుండియు నతిసాహసుడై దేశసంచారాసక్తి గలిగి యుండెను. ఆ రాజపుత్రుడు తన కిరువదేండ్లు వచ్చువరకు విచ్చలవిడిగ తనకడనున్న ధనమంతయు ఖర్చుపెట్టి తరువాత పశ్చాత్తాపమంది నిజాభరణములను గొన్నిటిని విక్రయించి వాణిజ్యము సేయదలంచి సరకులంగొని గావరదేశమునకు సరుకుతో నోడనెక్కి పయనించెను. కొన్ని దినములకా యోడ మలయద్వీపముచేరగా తనవెంటనున్న వర్తకులతో గలిసి యా రాజపుత్రుడు దీవిలోనికిబోయి యొక వృక్షచ్ఛాయను విశ్రమించెను. గాఢనిద్రపట్టెను. కొంతవరకు మేల్కొనిచూడ నోడ తీరమువిడచి చాలవరకుపోయెను. విక్రమసేనుడు మిగులదుఃఖాక్రాంతుడై దిశలుపగులునట్లార్చెను. ఆ దీవిలో నేమిజేయుటకుందోపక నున్మత్తునివలెదిరుగుచు నొక తెల్లనిరాతిపై గూర్చుండెను. అది పక్షి గ్రుడ్డు. కొంతసేపటికా ప్రదేశము గాఢాంధకారబంధురముకాగా నతడు తలపైకెత్తి చూచెను. పక్షియొకటి పర్వతమువలె క్రిందకు దిగుచుండెను. రాజపుత్రుడు ధైర్యమువహించి యెటకేగినను సరేయని తన యుత్తరీయము నా పక్షి కాలికి గట్టుకొనెను. ఆ పక్షి విహాయసంబున కెగుర నితడుకూడ నెగసిపోయెను. అట్లా పక్షి పోయిపోయి యొక పర్వతాగ్రమున నిలువ విక్రమసేనుడందాగెను. పక్షి తనదారింబోయెను. ఆ రాజ

పుత్రుడు పర్వతమునందలి యొక లోయంజూచి యది రత్నప్రభాభాసమానముగుట నందు రత్నరాసులున్నవని యవి గ్రహింపదలంచి లోనికి బోవ నా లోయ భుజంగమయమై యుండ రాత్రియంతయు నొకగుహ లోనిద్రించి సూర్యోదయము కాగానే యందు మాంసఖండములును, వానిం జేకొనిపోవు పక్షులునుగన్పట్ట నా పక్షులను బెదరించి యందలి రత్నంబులను గొన్నిటిని మూటగట్టుకొనెను. మెల్లగా పర్వతమెక్కి కొందరువర్తకులను గలిసెను. వారితో మాల్యవంతమున కేగి యటనుండి యంగదేశమును జేరెను.

విక్రమసేను డంగదేశమున నేమియుండోచక మరల పయనమై జయంతిద్వీపమున కేగ నోడయెక్కెను. ఓడ యధికారికాద్వీపమున దిగుట కవసరంబును, ఇష్టంబును లేకపోయినను తుపానువచ్చినను భయమున దిగవలసివచ్చెను. ఓడ యా ద్వీపమందాగగనే యచటి కోయలు నాయుధులై యోడను ముట్టడించి కొల్లగొట్టుకొని యందలివారినెల్ల బంధించి చేకొనిపోయి ద్వీపాంతర్భాగమందున్న మందిరమున బ్రవేశపెట్టిరి. ఆ ప్రదేశమంతయు రుధిరాస్థిమయంబుగనుండెను. అంత సాయంకాలము కాగానే కోయలు మద్యపానమొనర్చి నాట్యము చేయుచుండిరి. ఆ సమయమున కొకరక్కసి ఏకనేత్రి యటకరుదెంచి మనుజులనో రోజున కొక్కనిచొప్పున దినుచుండెను. విక్రమసేనుడొక్కడే మిగిలి యుండెను. స్వప్రాణరక్షణార్థమత డనేకయుక్తులనుపన్నుచు నొకదినమున నెర్రగాగాల్చిన మేకును నిశాసమయంబున వానికన్నులందు బొడిచెను. అతడు కుయ్యిడుచు నేడ్చుచు తన కరంబులనుసాచి కేసరిపగిది నుఱికెను. విక్రమసేనుడా దీవినుండి కలపదూలములను రెంటినినావగా జేసి దైవముపై భారముంచి బయలుదేరెను. రక్కసులా తీరముకడకు వచ్చి రాలు రువ్వసాగిరి. విక్రమసేనాదులా దూలముపై గూర్చుండి యొకదీవికిజేరిరి. అంత కొన్ని విషసర్పములు వారినిచుట్టుముట్ట నందరు

మరణించిరి. విక్రమసేనుడుమాత్రము తీరమునకే తేలెను. అతని దృష్టి కొకనావగోచరించ చేయిపిసరగనే యదియాగెను. ఆ నావనెక్కి యందలివారిచే గౌరవింపబడి యా యోడ మొదట తాను నిదురింపగా మలయద్వీపమునదాటిపోయిన యోడయయ్యెను. ఓడయధికారి యతనిని గుర్తించి యతని సరకంతయు నిచ్చివేసెను. ఆ సరకులను లాభమున కమ్మి మరలి యంగదేశమును జేరెను

ఆ దేశమున విక్రమసేనున కేమియుతోచనందున మరల బయలుదేరి యోడప్రయాణ మొనరించుచుండగా తుపానుచే నా యోడ సంద్రమున మునింగెను. విక్రమసేను డీదుకొనుచు నొక్కచోట నొడ్డుచేర నటనొక సొరంగము కన్పట్టెను. అతడా మార్గమునుండి వెడలగా నగర మొండు కాన్పించెను. ఆ రాజుతో నతనికి పరిచయముకాగా నా రాజు వివాహమాడి యిచ్చుటనేయుండుమని పలుక విక్రమసేనుడు మారాడలేక యొకయువతిని పెండ్లాడి యుండె. కొంతకాలముండుసరికి కక్కాంత వ్యాధిపీడితయై చనిపోయెను. ఆ దేశమున భర్త మరణించిన భార్యయు, భార్యమరణించిన భర్తయు సహగమనము చేసితీరవలెనను నాచారము కలదు ఆ యాచారప్రకార మిప్పుడు భార్యతో విక్రమసేనుడు సహగమనము చేయవలసివచ్చెను. ఆ నగరవాసులు మరణించిన భార్య కళేబరంబుతోబాటు విక్రమసేనునిగూడ గట్టితెచ్చి యొకలోయలో బడవైచి కొన్నిరొట్టెలనందుంచి యా లోయపై రాళ్ళుమూసి పోయిరి. గాఢాంధకారమయమైన యా లోయలో పెక్కుశవములుండుట దుర్గంధయుతమైయుండెను. అందున్న రత్నాభరణములకు లెక్కయేలేదు. విక్రమసేనుడు కొన్ని దినములా లోయలో బాధనంది కొన్నిరత్నములను మూటగట్టుకొని లోయద్వారమునుండి పదిమైళ్ళునడచిరాగా నతనికి సముద్రతీరముగానవచ్చెను. ఆ తీరమును జేరుసరికి యోడయొకటి సమీ

పమునుండి పోవుచుంటగాంచి విక్రమసేనుడు చేసంజ్ఞచేసెను. ఆ యోడ దరిజేర్చి యతని నెక్కించుకొని మిగులగౌరవించిరి. ఆ నౌక సముద్రమున పోయి యొకదీవింజేరెను. ఓడవారి కాదీవిలో పక్షిగ్రుడ్డు కాన్పించెను. దానిని వారు పగులగొట్టుచుండ విక్రమసేనుడు వారించెను గాని వారు వినక దానిం జితుకగొట్టి యాదీవిలో గొంత విహరించి యోడను నడిపించుకొనుచు సంద్రమున పోదొడంగిరి. ఆ నౌక కొంతదూర మేగుపరికి గొన్ని పక్షు లాకసమునుండి యోడపై ఱాలురువ్వగా నౌక ఖండఖండము లైనది. విక్రమసేను డొక్క చెక్కసహాయమున తీరమును జేర నటనొక సాంద్రారణ్యంబున ఋషిశిలకుం డొకడు కాన్పించెను. విక్రమసేను డామునికి నమస్కరించి, మహాత్మా! నేను కష్టజీవిని, నాకష్టములు గట్టెక్కునట్లు చేయుమని ప్రార్థింప నాముని పుంగవుండు రాజపుత్రా! ఆ శకంతములేదు. మానవుడు భవపాశబద్ధుడై గొవ, తనము నాశించుట సహజము. సంసారము సాగరమువంటిది. సారము లేనిది. మాయనుగ్రహించి పరమాత్ముని పవిత్ర పాదారవిందధ్యాన మొనరించువాడే ధన్యుండగును. జననాత్పూర్వము మరణానంతరము మనము లేనే లేము. మార్పునది లేదు. అదియే బ్రహ్మరహస్యము. దీనినే మాయ యని యెఱుక యని యందురని బోధించెను.

విక్రమసేనుడా మునివల్లభుని యుపదేశమున శాంతినొంది యా మునియాజ్ఞ నట కొంతకాలముండి పిదప జాల నగరమునుజేరి క్రమముగా నంగదేశమును ప్రవేశించెను. అతడు తాను సంపాదించిన ధనమును భద్రపఱచుకొని కాలము గడుపుచు నౌకాయానమున గొప్పవాడని, సాహసుడని పేరందెను. యంగదేశాధిపతియగు జయచంద్రు డొకనాడు విక్రమసేనుం బిలిపించి, అయ్యా! తాము నౌకాయానమున సర్వదేశములు తిరుగుచున్నారని ప్రసిద్ధికలదు. ఈ మారు పయనించి నప్పుడు మంచి రత్నములను మాకు దెచ్చిపెట్టుడన విక్రమసేనుడు తన

కడనున్న మణులలో నమూల్యములైన వానిం గొన్నిటి నారాజునకు కానుకగానిచ్చెను. జయచంద్రుడా రత్నములను తన ముద్దుకూతురగు సౌందర్యప్రభ కిచ్చెను. ఆమె విక్రమసేనుజూచి మోహించి తండ్రికి దెలుప నతడు సుక్షత్రియుండని తెలిసికొని తన కితరసంతతి లేనందున సౌందర్యప్రభను విక్రమసేనునకిచ్చి మహావైభవమున పెండ్లి యొనర్చెను జయచంద్రుడు విక్రమసేనునకు వివాహకాలమందే తనరాజ్యమిచ్చి పట్టాభిషిక్తుని గావించెను.

కృష్ణుడీ విధంబున కథ ముగించునప్పటికర్జునుండు, బావా! నేటికి నిద్రపోవుదమని నిద్రించెను.

---

## పదియవరాత్రి కథ.

పదియవనాటి రాత్రి కృష్ణార్జును లిరువురును యమునా సైకత స్థలిగూర్చుండి ముచ్చట లాడుకొనుచుండ పార్థుండు, బావా! ఈ రోజునకూడ నేదేని చక్కనికథచెప్పి నామనంబున కానందము కలుగ జేయుమన శ్రీకృష్ణుం డర్జునా! నేడు నీకతి సాహసశౌర్య విక్రమాన్వి తుండగు నగ్నిదత్తమహారాజుకథ చెప్పెద నాలింపుమని యిట్లుచెప్పెను.

## 10. అగ్నిదత్తమహారాజుకథ.

వీరకేసరి యను రాజేంద్రుండు పాంచాలమున కధిపతి. అతనికి చిత్రరేఖ యను పుత్రిక కలదు. ఆమె పూర్ణయౌవన కాగానే తండ్రి

వివాహమును చేయదలంచి నానాదేశ రాజపుత్రుల చిత్రపటములను దెప్పించి కుమార్తెకుజూప నామె యందెవ్వరిని వరింపననియు, నాయిచ్చిన ప్రశ్నలకు త్తరువులను తగిన వానిని జెప్పిన వాడే నాకు బతి కావలెననియు తండ్రితో జెప్పెను. వీరకేసరి నిజతనయ మనోభావమును దేశదేశంబులకు చాటబంపెను. రాజపుత్రు లనేకులువచ్చి చిత్రరేఖ పురప్రాకార కుడ్యంబునవ్రాయించిన ప్రశ్నలకు సమత్తరములను జెప్ప లేక నిరవకులై మరలి పోవుచుండిరి. అగ్నిదత్తుండను కాశ్మీర రాజపుత్రుడు చిత్రరేఖ సౌందర్యమునువిని యూమెపై వలపునిలిపి యొక చిత్రకారుని రావించి, అయ్యా! మీరేగి పాంచాల రాజనందయను చిత్రరేఖ చక్కదనమును బరికించి, యామె చిత్తరువును లిఖించుకొని రమ్మనియు, మంచిబహుమానమి త్తునవియు బలుక నా చిత్రకారుడు వెంటనే పయనంబై పాంచాలమునకరిగి చిత్రరేఖ దేవాలయమునకు బోవుచుండ చూచెను. అనంతర మాతడు రాజసభకరిగి తాను శబ్దము వనుసరించియు, రూపచ్ఛాయను జూచియు జిత్రముగా ప్రతిమలను వ్రాయగలనని పలుక నా వీరకేసరి తన కుమార్తె ప్రతిబింబమును నీటి లోజూపించి ప్రతిమ వ్రాయుమని యానతిచ్చెను. చిత్రకారుండు మూడు మాసములలో రెండు చిత్తరువులను తయారుచేసి యొకదాని నా వీరకేసరికిచ్చి బహుకృతు లందెను. రెండవదాని నగ్నిదత్తున కొసంగెను. అగ్నిదత్తుడా చిత్తరువును ముందిడికొని బహువిరాళి నొందుచు పటమునందింత జక్కనిదిగ గన్పట్టు చిలుకలకొలికి కన్నులతో జూచిన నెట్లుండునో యని తాపబాధ నందుచు దలిదండ్రులకుజెప్పిన పోనియ్యరని యర్థరాత్రమున నశ్వారూఢుడై పాంచాలమునకు బయలుదేరెను. అగ్నిదత్తుడు మార్గమధ్యమున క్రూరమృగ సంకులంబులగు విపినంబులను గిరికందములను జూచుచు ఫలములందినుచు జలము గ్రోలుచు కతిపయ ప్రయాణంబులలో పాంచాలమును జేరెను. అతడా నగరమం

దలి సత్రమున బసచేసి ప్రతి శుక్రవారము చిత్రరేఖ నగరబహిః ప్రదేశమందున్న దేవాలయమునకు బోవుట తెలిసికొని శుక్రవార మెపుడు వచ్చునా యని వేచియుండెను. అగ్నిదత్తుని జననీజనకులు కుమారుని జాడ తెలియక నలుదిశలకు భటులనుబంపి వెదకించి సఫలమనోరథులు కాలేక విచారాక్రాంత చిత్తులై యుండిరి. చిత్రరేఖను దేవాలయమునకు బోవుచుండగాంచి యామె నగరప్రాకార కుడ్యమందు వ్రాసిన ప్రశ్నం దిలకించెను. అందు, 'నిన్నొకసారి చూచియుంటిని, మరియొకమారు చూడగోరుచుంటినని యొక డొక మైదానమున నేడ్చుచున్నాడట. అతడెవరు ? ఎందుల కేడ్చుచున్నాడని యున్నది. దీనికెట్లు సమాధానము చెప్పుదునా యని యాందోళిత మనస్కుడై యాశానిరాశల మధ్యబడి తన్నుకొనుచు నరణ్యప్రాంతములకేగి యొకచో జ్ఞానశీల మున్యాశ్రమమును బ్రవేశించి యా మునిచంద్రునకు నమస్కరించి తన వృత్తాంతమును సాంతముగ దెలిపెను. అంత నా ముని, వత్సా ! అతి హేయంబగు కామోద్రేకమును విడచి ముక్తిదాయకమార్గ మన్వేషింపుము. వేదాంతమార్గ సోపానములలో నొక్కటగు ఆకార నిరాకార భావమును దెల్పుచుంటి నాలింపుము.

వేద ప్రమాణమునుబట్టి బ్రహ్మ మవాఙ్మానస గోచరమని యెఱుంగవా ? వాఙ్మనసము లనిత్యములనియు, నిరాకారబ్రహ్మ మనిత్యమనియు దెలియుము. వాయువుతో వాయువును, జలముతో జలమును, భూమితో భూమియును, ఆకసముతో నాకసంబును, అగ్నితో నగ్నియును కూడినట్లు లాహోజ్యోతిచే నాదబ్రహ్మమును కన్గొని మహదానందమందుము. త్వక్చక్షుశ్శ్రోత్రాది జ్ఞానేంద్రియములను, వాక్పాణిపాదాది కర్మేంద్రియంబులను కాని నిరాకారము, నిర్వికారము నగు బ్రహ్మబదార్థము కాన్పింపదు. స్థూలమైన కనుగ్రుడ్డునందు సూక్ష్మంబగు కనుపాపం జూడుము. దానినే తేజంబని, కళయని, అహోజ్యోతులని

చెప్పెదరు. ఈ యాపోజ్యోతులను తెలిసికొన్న వారికి పునర్జన్మ రాహిత్యమగు ముక్తిరతిలామలకమై జరామరణంబు లుండవనిజెప్ప నగ్నిదత్తుఁ డాబింబమును జూచి యమందానందమంది, స్వామీ! ఇట్టి యమూల్యోపదేశమొనరించి నన్ను ధన్యుంజేసితిరనెను. అంత నామునిపుంగవుం డగ్నిదత్తునందు కరుణార్ద్రహృదయుండై మఱికొన్ని వేదాంతరహస్యములను దెల్పి యాశీర్వదించెను. అపుడా రాజపుత్రుఁడు, మహాత్మా! నాకిక చలవీవలయును. ఏమందురా! చిత్రరేఖ యను రాజపుత్రిక యొక ప్రశ్న మడిగినది. దానికి ప్రత్యుత్తరము కావలెనని యాప్రశ్న జెప్ప నాముని యిట్లనెను. వత్సా! ఈ మార్గముననే కొంతదూరమేగి నచో నొక సరస్సు కన్పట్టును. దానియొద్దున నొక చెట్టుండును. ఆ జలాశయ సోపానశ్రేణిం జని నీరుముట్టితివా దిగంబరయగు నొక నారీమణి యీవలకువచ్చి నిన్ను లోనికి గొంపోవును. మఱికొందఱు రమణీమణులు నిన్ను జుట్టుముట్టి నృత్యాదులొనర్తురు. వారిలో నసమాన లావణ్యవతియగు కన్నె యొకర్తుండును. ఆమె వారికి రాణి. ఆమెను జూచి నీవు భ్రాంతినందక నాల్గుదినంబులవర కామెను స్పృశింపకుంటివా యామెయే నిన్ను తర్వాత వలచును. అపుడు నీవు ఒకసారి నిన్ను చూచి యున్నానని పిలపించుచు మానవుఁడున్న మైదానముం జేరుదువు. పొమ్మని సెలవిచ్చి పంపెను.

అగ్నిదత్తుఁడా మునిచెప్పినరీతినడచి కొలనుజేరి లోనికిం దిగి నీరు ముట్ట దిగంబరయగు వనితామణివచ్చి లోనికిం గొనిపోయెను. అందొక సుందరతరోద్యానముండెను. మఱికొందరు వనితామణులువచ్చి నృత్యగానాదులు చేయదొడంగిరి. మధురఫలంబుల నతనికి భక్షింపనిచ్చి భవనాంతర్భాగమునకుగొంపోయి సింహాసనమున గూర్చుండజేసిరి. వెంటనే పెద్దధ్వనియయ్యెను. తాను గూర్చున్న సింహాసనపుకోళ్ళు విరిగెనేమోయని పరీక్షించి చూచుచుండ వెనుకటివలెనే భయంకరశబ్ద

మయ్యెను. ఆక్షణమ యపూర్వలావణ్యవిలాసినియగు నొక వనితామణి యొకర్తు సింహాసనముపక్క నిలువంబడి యాతనిపై బ్రణయావలోకనములను బరుపసాగెను. అగ్నిదత్తు డామె ముఖారవిందము నావరించి యున్న యతికుంతలముల దొలగింప నుత్సహించెగాని యంతలో ఋషి పలుకులు జ్ఞప్తికివచ్చి యూరకుండెను. నాల్గుదినము లిట్లుగడువ మరు నాడాతన్వి యగ్నిదత్తుని సౌందర్యమునకు మోహితయై యతనిమోము ముద్దాడెను. ఆతడును కామోద్రిక్తుడై యామెను గౌగలించెను. వెంటనే పెద్దధ్వనియై సింహాసనము వెనుకతట్టునుండి యొక భామినివచ్చి యతనిని తన్నగా నాత డధోముఖుడై యెందుబడుచున్నాడో తెలియక కన్నులుమూసెను. కన్నులు తెరచునప్పటి కాతడొక మైదానమునందుండెను. అప్పుడు దూరమునుండి, నిన్నొకసారి చూచియున్నాను. ఇంకొక సారి చూడగోరుచున్నానన్న పలుకులు వినవచ్చెను. అనేక దినంబులు నిద్రాహారములుమాని నడచిపోగా నిన్నొకసారిచూచియున్నాను. ఇంకొకసారి చూడగోరుచున్నానని యెలుగెత్తి కేకలిడువృద్ధుడు కాన్పించెను. అగ్నిదత్తు డతనింజూచి, అయ్యా! నీ వట్లు విలపింపహేతువేమి? అన నా వృద్ధుండు, బాబా! చెప్పెద నాలింపుము. ఒకనాడు నేనొక సరోవరమునకేగి నీరుముట్టగా నొక కాంతవచ్చి నన్ను లోనికి దివ్యభవనాంతర్భాగమునకు గొంపోయెను. ఆ భవనమందున్న యొక సుందరాంగి నన్నుజూచి వలపుగదియించెను. నాలుగుదినములట్లుండ నేనింక విరాళి బట్టజాలక నన్ను గౌగలించుకొనబోవు నామె హస్తమును బట్టుకొంటిని. వేరొకవనితవచ్చి నన్ను తన్నినటులయ్యెను. మరుక్షణముననే నీ మైదానమందుంటిననిపలికి మరింతరోధింపసాగెను.

అగ్నిదత్తు డపుడావృద్ధుని కొలనుకడకుగొంపోయి, అయ్యా! నీకు వారితో జిరకాలముండవలెనను నాసయున్న నీ వధిష్టించిన సింహాసనము కడ కరుదెంచు సౌందర్యవతిని తాకవద్దు. అట్లయిన నెంతకాలమైన

నుండవచ్చునని పలుక నా వృద్ధుడు నీరమంటి లోనికిబోయెను. అగ్ని దత్తుం డటనుండి మరలి పాంచాలమునకరిగి చిత్రరేఖప్రశ్నకు సదుత్తర మిచ్చెను. ఆమె మహాదానందమంది యతని కంఠమున పూదండనిడెను. వీర కేసరిమహారాజు కాశ్మీరభూపాలునకు లేఖనంపి సబంధుమిత్రపరివారముగ రప్పించి చిత్రరేఖాగ్నిదత్తులకు మహావైభవంబుతో వివాహ మొనరించెను.

శ్రీకృష్ణుం డిట్లుచెప్పి ముగించువర కర్జునుండు నిద్రాదేవికి వశుడై యింకనిద్రింతము బావాయని నిద్రిముద్రితుడయ్యెను.

---

### పదునొకండవరాత్రి కథ.

పదునొకండవనాటిరాత్రి యథాప్రకారముగ కృష్ణార్జునులు యమునాప్రవంతినీసైకతస్థలంబున విహరింపుచుండ నర్జునుండు, బావా! నేడుకూడ నేదైనకథ చెప్పి నన్నానందింపజేయుమనగా నా ద్వారకావాసి యిట్లు చెప్పనారంభించెను.

### 11. చిత్రధ్వజమహారాజు కథ.

పూర్వము సూర్యగుప్తుండనురాజు ఘూర్జరదేశంబున కేలికయై చిరకాలము సంతతిలేక సావిత్రీదేవి నుపాసించెను. ఆ దేవిప్రసాదమున నా రాజుభార్య యంతర్వత్నియై నవమాసంబులునిండినవెనుక నొకమగ బిడ్డంగనెను. సూర్యగుప్తుడా బాలునకు చిత్రధ్వజుడని నామకరణం బొనర్చి గారాబముతో బెంచుచుండ నా బాలుండు శుక్లపక్షపాకరుని

భాతి దినదినాభివృద్ధినందుచుండెను. అంతలో నా రాజేంద్రుని యాస్థానమునకు జ్యోతిషవిద్యాపారంగతుడైన పండితు డొకండువచ్చెను. రాజా పండితుని గౌరవించి చిత్రధ్వజునిజాతకము చేతికిచ్చెను. ఆ పండితుండు మేనమేషములులెక్కించి మహాదశాంతర్దశలుగుణించి ద్వాదశభావఫలంబుల నూహించి సాకల్యంబుగా జన్మపత్రికను విమర్శించి, మహారాజా! నీ కితడు మారకుడు. ఇతనికి గ్రహగతియతి నీచగానున్నది. ఇత నెచ్చటికైన బంపివేయుము. లేదేని యీ బాలున కైదేండ్లుదాటగనే నీ రాజ్యము శత్రువశమై నీకు మారకముగూర్చెను. ఈ బాలుడు చాల కష్టంబుల నెదుర్కొనవలసియుండును. కష్టములన్నియుదాటినపిదప నీతండు చతుస్సముద్రముద్రితమహీవలయంబున కేలికయగునని చెప్పెను. సూర్యగుప్తుండా విద్వాంసుని పలువిధంబుల బహూకరించి పంపి విచారసాగరమగ్నుడై చిరకాలతపఃఫలంబగు కుమారుని విడచుటో, శోకసముద్రమునదూకుటో నిర్ణయింపలేక మాటాడకూరకుండెను. బాలున కైదేండ్లు గడచెను. అంత కళింగదేశాధీశుండగు జయసేనుండు చతురంగబలసమేతుడై ఘూర్జరమును ముట్టడించెను. సూర్యగుప్తుండతిధైర్యముతో శత్రుసైన్యముల నెదురించెను. ఆ యుభయసేనలకు పోరు ఘోరంబయ్యె. సూర్యగుప్తుని సైన్యముకంటె జయసేనునిసైన్య మెక్కువగానుండుటచే సూర్యగుప్తు డపజయమందెను. అతడు గర్భవతియైన భార్య సుశీలాదేవితోను చిత్రధ్వజునితోను ప్రాణాపాయమును శంకించి సారంగమార్గమున విపినంబుల కరిగెను. ఆ విపినమధ్యంబున భార్య ప్రసవించి యా మహాతాశిశువు లిరువురేకమై నాకమునకుబోయిరి. ఆ యాపద్దశలో నా రాజు దినద్వయమహారశూన్యుడై యుండెను. అతడా దుఃఖముతోనే తల్లిలేనిపుత్రుని వెంటనిడుకొని రామచంద్రపురమను నగరంబునకేగి మాయవేషముతో బిచ్చమెత్తి జీవింపుచుండెను. చిత్రధ్వజు

డొకవిప్రునింట పసులకాపరిగ నియమింపబడెను. ఇంతలో సూర్యగుప్తుడుకూడ స్వస్థురాలగు సుశీలాదేవి సన్నిధికిబోయెను.

పశువులకాపరిగ బ్రాహ్మణునికడనున్న చిత్రధ్వజు డొకనాడు పశువులందోలుకొని కాననమునకేగి యట తుపానుచే నెదుర్కొనబడెను. పశువులు నలుదిశలకు బారినవి. ఇతం డేకాకియయ్యెను. ఆ సమయంబున శార్దూలగర్జనమొండు వినంబడ నతడొక వృక్షమునెక్కెను. అందొక సర్పముండి వానింగఱువ విషము తలకెక్క నా చెట్టుక్రింద వేటకాడొకడు పన్నినవలలోబడెను. మరునాడా వేటకాడువచ్చి ఉచ్చులను సడలించి మూర్ఛనందియున్న చిత్రధ్వజుని పురమునకుగొంపోయి విషవైద్యునకుజూపగా నా వైద్యు డొకమూలికను నాసికకాఘ్రాణింపజేయ చిత్రధ్వజుడు కన్నులందెరచెను. దిక్కులేని యా బాలుంజూచి జాలిపడిరి. అందు సంతతిలేని దంపతులతనిని దత్తుగాబెంచుకొనుచుండిరి. చిత్రధ్వజుడు పాఠశాలకుబోయి చదువుకొనుచుండెను. ఆ పాఠశాలలోనే రాజమంత్రిపుత్రు లిరువురును జదువుచుండిరి. ఒకనాడా రాజస్థానపండితుడు పాఠశాలకువచ్చి పిల్లలందరకును చేతులుచూచి సాముద్రికము జెప్పుచుండెను. చిత్రధ్వజునిచేయికూడ నా పండితుడు పరిశీలించి యాశ్చర్యపడి, "ఈతడు చతుస్సముద్రముద్రిత హీవలయంబునకు చక్రవర్తియగు" నని వచింపగా రాజపుత్రుడా మాటలను తనతండ్రికెఱుకపఱచెను. ఆ రాజు, యీ రాజపుత్రు డెప్పటికైన మనకే ముప్పు తెచ్చునేమోయని శంకించి నల్వురభటులనుబిలచి, వీని నరణ్యమునకు గొంపోయి వధించిరండని యాజ్ఞాపించెను. వెంటనే యీ నల్వురును చిత్రధ్వజుడు పాఠశాలనుండి యింటికేగుచుండ పొంచియుండి బంధించి విపినమునకుగొంపోయి వధ్యస్థానము సమీపించిరి. అంత నందులో నొకడు, అన్నలారా! ఈ బాలునిజూడ జాలికలుగుచున్నది. మన మందరము బిడ్డలున్నవారమే. ఇతడును మన బిడ్డలవంటివాడే. మీదు

మిక్కిలి దిక్కు లేనివాడు. ఇట్టివానిం జంపనేల? అయిన సీతనోనిర్బిన్న నేరమేమి? ఈతని సుకుమారసురూప సుగుణాదులుచూడ మహాత్ముం డగునని తోచుచున్నది. ఇతనిని చంపక విడువవలెను. అని యాలోచించి, ఓ బాలకా! నిన్ను వధింపుమని మహారాజునాజ్ఞ. అందులకే యిటకు దెచ్చితిమి. నిన్ను వధింప మాకు మనసు లేదు. అనగానే చిత్రధ్వజుడు 'సర్వం దైవాధీనం' బనెను. అంత నా భటులు, బాలకా! నిన్ను జంప మా చేతులాడుటలేదు. ఇటనుండి యెక్కడికైన వహొమ్మని పలికి వెడలిపోయిరి. చిత్రధ్వజున కెటుపోవుటకు దోచలేదు. వర్షము ధారాపాతముగ గురియ మొదలిడినది. మేఘనిస్వనములు భూమి నల్లలాడించుచున్నవి. మార్గము కంటకాన్వితమైనది. అట్లే యతడామార్గమున నడచినడచి యర్ధరాత్రమునకు వసిష్ఠునాశ్రమమునకు జేరెను. చిత్రధ్వజుడా మునిపుంగవునకు నమస్కరించి తన వృత్తాంతమాద్యంతము నివేదించెను. అమ్ముని చిత్రధ్వజు నాదరించి ఫలములను భుజింపయిచ్చి, వత్సా! మోక్షసాధనము సత్సంగత్వమని యెరుంగవు కాబోలును.

శ్లో. సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం,
నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చలతత్వే జీవన్ముక్తిః.

అను శ్లోకము ననుసరించి సజ్జనసహవాసము చేయవలెను. దాని వలన సర్వసంగ పరిత్యాగబుద్ధి జనించును. పరమేశ్వర ధ్యానమున పాపములు రూపుమాయును. ఇంద్రియ నిగ్రహత్వము, సత్యవాగ్నియమము కలవాడే ధన్యుండు. ఆత్మతత్వవిచార మొనరింప జ్ఞానియైన ప్రతిపురుషుడు నష్టుడే. జీవుడనుభవించు విచార మనంతమగుట జ్ఞానజ్యోతిచే నజ్ఞానాంధకారమునవలదోచి స్థూలశరీరమును విడువవలయును. జ్ఞానమనసత్వము. పరబ్రహ్మ పదార్థనిర్ణయమునకదియే ప్రధానసాధనము. భక్తి భగవద్భక్తుల సహవాసమున నలవడును. కాంతా

కనకంబులందానవర్జించి యీషణత్రయమును మఱచినవాడే మోక్షసాధన మరయునర్హుండు. ఐహికసుఖములు, ఆనంద భోగములు నస్థిరములు. జీవితము నీటిబుడగవంటిది. క్షణభంగురము. భగవంతుని పాదారవింద ధ్యానమే పరమార్థమునకు పరమావధి. ఆపరాత్పరుడే జగంబులకు మూలాధారుడు. సర్వము దైవాధీనంబని నమ్మినవాడే ధన్యుండు. వానికి ముక్తి కరతలామలకంబని బోధింప చిత్రధ్వజు డమందానందమంది యొక్క సంవత్సరమా మున్యాశ్రమమునుండి పిదప భూసంచారమునకు బయలుదేరెను. అతడహోరాత్రంబులు నడచి యొక నగరమునుజూచి వింతపడుచు క్షుద్బాధ తాగలేక నొక విప్రగృహాంగణమున నిలిచి, అయ్యా! గుప్పెడన్నము పెట్టెదరాయని గృహయజమానిని బ్రశ్నింప నతడు, నాయనా! ఇచ్చటికి క్రొత్తవాడవు కాబోలు ఇది స్వరూపదేశము. మారాజు విచిత్రవర్తనుడు. అతడు తన దేశప్రజలందరకు నిరంతరాన్నదానము చేయుచుండును. మేము తని భోజనశాలకే పోవుదుము. నీవచటికేగుమని చెప్ప చిత్రధ్వజు డందరతోను భోజనశాల కరిగెను. ఆ రాజునకు వివాహోచిత వయస్కలగు నిరువురు పుత్రిక లున్నారని తెలిసికొనెను. భోజన సమయమందా రాజు శాలకు భుజింపవచ్చిన వారినందఱను "సర్వము నాయధీనము కాదా?" అని యడుగుచుండెను. అందఱును "సర్వము తమ యధీనమే" యని యనుచుండిరి. రాజు చిత్రధ్వజునట్లడుగ నతడు, 'సర్వము దైవాధీనం' బనెను. ఆ రాజంత కోపోద్రిక్త మానసుడై చిత్రధ్వజుని, క్రూరుడా! నీనాల్క వేయిచీలికలు కావలెను. అందఱును నాయధీన మన నీవు దైవాధీన మందువా! నిన్నిపుడే చిత్రవధ చేయింతుననుచు రాజభటులం బిలిచి వీనిని సంద్రములో ద్రోసిరండని యాజ్ఞాపించెను. అపుడటనున్న వారందరితని కరుణింపుడు. శుభసమయంబున నిట్టిశిక్ష విధించుట న్యాయముకాదని విన్నపింప రాజు సమ్మతింపక నా యాజ్ఞ చెల్లి తీరవలెనని కోపంబున బలికెను.

అంత రాజభటులు చిత్రధ్వజుని బంధించి నావపై నెక్కించి గభీరసాగరమున విడచి వారు వెనుదిరిగి తీరముం జేరిరి. చిత్రధ్వజుడు సాగరమధ్యంబున నావపై యిటునటు గొట్టుకొనుచు కొన్నిదినంబులకు వైజయంతీపుర ప్రాంతమునకు సమీపించెను. ఒక పల్లెవాడాపరిసరమున చేపలంబట్టుచు చిత్రధ్వజుని నావపై జూచి రక్షించి తీరము జేర్చెను. ఆ సమయమునకే వైజయంతీ నగరాధిపతి స్నానార్థమై సంద్రమునసకువచ్చి చిత్రధ్వజునిజూచి నగరమునకు గొంపోయి చికిత్సల జేయింప స్మృతిపథంబునకు వచ్చెను. రాజాతనిని, నీవెవ్వడవు! అని ప్రశ్నింప చిత్రధ్వజుడు సర్వము దైవాధీనంబనెను. ఎన్ని ప్రశ్నించినను రాజపుత్రుడు దైవాధీనమ్మను మాటతప్ప వేఱుపలుకకపోవ గోపపడి, వీడు నేనొనరించిన యుపకారమునకైన విశ్వాసముంచక నిట్లు మొండిగా పలుకుచున్నాడని గర్జింపుచు వీనిని చిత్రవధ గావింపుడనెను. రాజభటులంత, మహారాజా! రక్షించిన వానికింతశిక్ష విధించి చంపించుట భావ్యముకాదు. జగంబున స్త్రీలకు వశుడుకాని వాడుండడు. ఇతనిని స్త్రీల వశమునసుంచి మాటలాడింప వచ్చునని విన్నవించిరి. రాజు వారిమాటలకు సమ్మతించి, ఎవరైన నీరాజపుత్రునిచే సర్వము దైవాధీనమ్మనుమాట దక్క నితరవచనంబుల బలికించిరేని వారికి వేయి వరహాల నిత్తునని తన దేశమున జాటింపించెను. మరియు సల్లాపమాసంబులలోగా మాటలాడింపలేనిచో వారి కురిశిక్ష విధింతునను నియమమేర్పరచెను. ఉరిశిక్షకు భీతిల్లి యా దేశవాసులుగాని యితరులుగాని యీపనికి ప్రయత్నింపలేదు కాని మిగుల గడసరియు, రూపవతియు, విద్యావతియునని ప్రసిద్ధినందిన లతాంగియను వేశ్యాంగన రాజసభకువచ్చి, తామిచ్చిన గడువు కాలములో నితనిని నేను మాటలాడింతునని చిత్రధ్వజుని తనవెంట స్వగృహమునకు గొంపోయెను. అనుదినమా భోగస్త్రీయతనికి షడ్రసోపేతంబగు భోజనంబిడి సరససల్లాపము లాడుచు నెంత

లాలించినను దైవాధీనమ్మనుమాట దక్క మరొక్కటి పలుకలేదు. ఆమె యిట్లు నాలుగుమాసమ్ములు పలుబాధలుపడి తుదకు విసిగి, అయ్యో! నేనెందుల కీపనికి బూనుకొంటిని. కుడిచి కూర్చుండలేక యీ ముప్పు దెచ్చుకొంటిని. వీడెంత లాలించినను వినడయ్యె? ఏమి చేతును? ఎట్లువీనిని వదలించుకొనవలెనని తన సౌధమునుండి క్రిందకు ద్రోయించెను.

చిత్రధ్వజుడట్లు లతాంగిచే సౌధమునుండి క్రిందికి ద్రోయింప బడు సమయమున కామార్గమునుండి పెండ్లికి తరలిపోవు పెండ్లివారి పల్లకిలో బడెను. అందు కునికిపాట్లు బడుచున్న పెండ్లికొడుకాపాటు నకు పల్లకినుండి క్రిందకుబడెను. ఆ యూరేగింపు సందడిలో నెవ్వరు నీసంగతి గమనింపలేదు. పల్లకినుండి జారిపడిన పెండ్లికొడుకు నేనుగులు త్రొక్కుటచే వాడు మరణించెను. చిత్రధ్వజు డాపల్లకిలో గూర్చుండి వివాహమంటపము చేరెను. పిమ్మట నచట వివాహోచిత కృత్యముల న్నియు ముగిసి మాంగళ్యసూత్రము గట్టువేళవచ్చెను. చిత్రధ్వజుడు జంకుగొంకులేక మాంగళ్యసూత్రమును ముడివేయుచుండ నాపెండ్లివారీ పెండ్లికొడుకు మారాజపుత్రుడు కాడని విచారముతో తమదేశము నకు బోయిరి. పాండ్యరాజు చిత్రధ్వజుని యల్లునిగా నెట్లో స్వీకరించెను గాని యతిడేమడిగినను దైవాధీనమ్మనియే పలుకుటకు విచారమున నుండై యుండెను. అంతలో స్వరూపదేశాధిపతి పుత్రిక లిరువుర కును మంత్రితనయకును వివాహము లతివైభవముగ జరుపబడునను చాటింపు పాండ్యదేశమున ప్రకటింపబడుటచే పాండ్యరాజు తనయల్లు నాస్వయంవర మహోత్సవమున కేగిరమ్మని యనుచర సమేతముగ నంపెను. స్వరూపదేశాధిపతి స్వయంవరమునకు ముందు తన పుత్రికలను గురుదక్షిణ నొసలిచ్చుటకుగాను గురునిసన్నిధి కమూల్యవస్త్రాభరణాదు లిచ్చి పంపెను. వారు గురుసన్నిధికరిగి బహుమానముల నంగీకరింపు

డని ప్రార్థించిరి. అంత నాగురునకు లక్ష్మణపండితుడు రాజపుత్రికలం గాంచి, రాజకుమారికలారా! నాకు వలయునంత సంపదను నీజనకుడిదివరకే యిచ్చియుండెను. నాకేమియు లోటులేదు. నాకే బహుమతులక్కరలేదు. నాకొక కోరిక కలదు. అదేదన, మీ రూపంబులు నన్నాకర్షించినవి కాన మీయందు వలపునిలిపితి నది తీర్చుడనెను. అంత నా రాజపుత్రికలు, గురువరా! ఉపాధ్యాయులు పితృతుల్యులని పెద్దలు వచింతురు. తామిట్లుగోరుట ధర్మమాయున నాగురుండు, రాచకన్నలారా! మీ వన్నెలాడితనము మనంబుననెన్ని మున్నెన్నడో వలపు నిలిపితి చెల్లించిన చెల్లింపుడు. లేనిచో నాపాపము మీదే యగునన

కాంతామణులు గురునికోరిక దీర్పనెంచి, గురువరేణ్యా! మేము మనఃపూర్తిగ మీ కోరిక చెల్లింతుము. కన్యాత్వభంగమునకైన నొప్పుకొందుము. ఇది జాగరూకతతోను, నిగూఢముగను, జరుగవలయును. లేనిచో మీకును మాకునుగూడ ముప్పువచ్చును. దానికొక యుపాయమాలోచించితిమి. స్వయంవర సందర్భమున జరుగు నుత్సవములలో ముందుగ నైంద్రజాలవిద్యాప్రదర్శనము జరుగును. ఆసమయమున సందరావినోదమును జూచు హడావిడిలో నుందురు. మేము వేర్వేర నాయవకాశమున తమకోర్కె దీర్తుమని నచ్చజెప్పి కానుకలిచ్చి గృహంబునకు మరలిరి.

స్వయంవర మహోత్సవమున కనేకులు మహారాజులు, సామంతులు, సేనాధిపతులు, రాజపుత్రులు. జనసంఘములు విరివిగా వచ్చియుండిరి. ఇంద్రజాల విద్యాప్రదర్శనము ముందుగ నేర్పాటుజేసిరి. సభవారందరా వినోదములను జూచుచుండిరి. ఆ తరుణమున రాజపుత్రికలు ప్రచ్ఛన్నవేషమున నంతిపురికి రావలసినదిగా గురునకు వర్తమానమంపిరి. అంత లక్ష్మణపండితుడు బాగుగా నలంకరించుకొని వచ్చెను. ఆ పండితుని చూడగనే మంత్రి, బుధశేఖరా! ఇంద్రజాల విద్యాప్రద

ర్శనమునకు నగరములోని పెద్దలు కొందరింకను రాలేదు. పోయి పిలుచుకొని రండని యాజ్ఞయిడెను. పండితుని గుండెలలో రాయిపడెను. నావేడుక కీమంత్రి యడ్డువచ్చి నితడెక్కడ దాపురించెనో యని విసుగుకొనుచు నగరములోనికి బోయెను. రాజపుత్రిక లిరువురును మంత్రి తనయయు గంట కొక్కరుచొప్పున గురునితో భోగించుట కభిలషించి ప్రత్యేకముగ గదులనలంకరించి తాము వివిధాలంకార భూషితలై గురుని రాకకు వేచియుండిరి. సభామందిరముననున్న చిత్రధ్వజు డక్కడకు తాళలేక నుద్యానవనంబునకేగి కొంత విహరించి యందున్న సౌధ రామణీయతకు మెచ్చుచు లోనం బ్రవేశించి యొక గదిలోనున్న పూపాన్పుపై బరుండెను ఇంతలో రాజపుత్రికలలో మొదటి యామెవచ్చి శయ్యపైఁ బరుండినవాడు తన గురువర్యుడే యని తలంచి దీపములార్పి యాతనిప్రక్క బరుండి రతికేళి దేల్చిన పిదప, గురువరేణ్యా! తమకోరిక తీరినదికదా యని యడుగ చిత్రధ్వజుడు దైవాధీనంబని ప్రత్యుత్తర మిచ్చెను. రాజపుత్రిక కంఠస్వరమునుబట్టి యతడు గురువు కాడని గ్రహించి దీపము వెలిగించి చిత్రధ్వజునిగాంచి, అయ్యా! మీరెవరు? అంతిపురికిట్లేల వచ్చితిరని ప్రశ్నింప నతడు దైవాధీనంబనుచు మరియొక గదిలోనికేగెను. అందు రెండవ రాజపుత్రిక గురుని రాకకై వేచియుంట నామెతో భోగించి పిదప మూడవగదిలోనికివచ్చి మంత్రి తనయతో భోగక్రీగ దేలి తనబసకు బోయెను. లక్ష్మణపండితునకు మంత్రి నిర్బంధమువలన వాడు రాజపుత్రికలతో భోగించుటకు వీలుఁ చిక్కదయ్యె. మఱునా డుదయమున నాయుంగనామణులు మువ్వురును రాత్రిజరిగిన పరాభవమునుగూర్చి పరస్పరము జెప్పకొనిరి. మఱియు గురువరేణ్యుండు రానందున తమకు దోషము లేదనియు, నిజముగా గురుడే మనలంగలసిన మన సతీత్వమునకు భంగము వాటిల్లుననియు, రాత్రి తమతో భోగించిన యా రాజపుత్రునే మువ్వురును వివాహమాడుద మనియు నిశ్చయించుకొనిరి.

సూర్యోదయమైనది. స్వయంవర మానాడేయగుట రాజపుత్రు లందరొకరినిమించి మరొకరు చక్కగా నలంకరించుకొని స్వయంవర మండపమున గూర్చుండిరి. చిత్రధ్వజుడుకూడ నందే యుండెను. అమ్మ న్నూరుకన్యలు జగన్మోహనకరముగ నలంకరించుకొని స్వయంవర మండ పమునకు రాజపుత్రులందఱను కలయజూచి చిత్రధ్వజుని గుర్తించి యతని కంఠమున పూలమాలికలనుంచిరి. స్వరూప దేశాధిపతి చిత్రధ్వ జున కామువ్వురనిచ్చి మహావైభవమున వివాహ మొనరించెను. ఏప్రశ్న యడిగినను చిత్రధ్వజుడు దైవాధీనమ్మని పలుకుటకు రాజు కోపించి యీ కన్నెలతో మీ రీతనిచే నొక్కగంటలో మాటలాడింపనిచో మిమ్మందఱను నురిదీయింతునని మహాకోపంబున బలికెను. ఆ తరుణీ మణులంత చిత్రధ్వజుని సమీపించి, నాథా! మీరడిగినదానికెల్ల సమా ధాన మీయకపోయినచో మేమాత్మహత్యలం జేసికొందుము. పైన మీ చిత్తమనిరి. ఇంకను మాటలాడ కూరకున్నచో నాపదరాగలదని విచ్చలవిడిగ మాటలాడ నారంభించెను. రాజమందానందమంది యల్లుని స్వరూపరాజ్యమునకు పట్టముగట్టెను. పిదప చిత్రధ్వజుడు పాండ్యరా జ్యమునుకూడ మామవలన గ్రహించి రెండుదేశములను పాలింపు చుండెను.

ఇట్లు కృష్ణుండు చెప్పగానే యర్జునుండు, బావా! ఇక నిద్ర కాగలేను, అని నిద్రాముద్రితు డయ్యెను.

---

## పంద్రెండవరాత్రి కథ.

పంద్రెండవనాటిరాత్రి కృష్ణార్జునులు యమునానదీతటమున గూర్చుండి ముచ్చటలాడుచుండ నర్జునుండు శ్రీకృష్ణుంగని, బావా! నీవు పదునొకండుదినంబులనుండి చిత్రాతిచిత్రితంబులగు కథలంజెప్పి నన్నెంతయో యలరించితివి. నేడుకూడ నంతకంటె నత్యంతమధురంబును, ఆశ్చర్యకరంబగు కథయొండు చెప్పి నా కానందమును గూర్పుమన శ్రీకృష్ణుండు, అర్జునా! నేడు నీకు విగంతవిశ్రుతకీర్తియుంతుండగు శ్రుతకీర్తిభూపాలుని కథఁజెప్పెద నాలింపుమని యిట్లువచింప నారంభించెను.

## 12. శ్రుతకీర్తిమహారాజు కథ.

శ్రీమంతంబగు నీ ధరామండలమునకు మండనాయమానంబై, అంగ వంగ కళింగ కాశ్మీరాది దేశములకంటె నన్నివిధంబులమిన్నయైన సౌరాష్ట్రదేశమును శింశుపాలుండను భూకాంతుండు పాలించుచుండెను. అతని సతీమణి వాసంతికాదేవి. ఆ దంపతులకు సమస్తవైభవంబులుండియు సంతానములేనందున సందులకై వివిధంబులగు దాన జప హోమ వ్రతతీర్థయాత్రాచరణాదిధర్మకార్యముల నాచరించిరి. వానిఫలమో యనునట్లు వాసంతికాదేవి యంతర్వత్నియై నవమాసములుగడచి పదియవమాసంబు జొరబడినపిమ్మట నొక శుభవాసరంబున మగశిశువుంగనెను. ఆ బాలుండ లోకసామాన్యుండై రెండవభాస్కరునివగిది విరాజమానుండై యుండ తండ్రి యాతనికి శ్రుతకీర్తియని నామకరణంబొనర్చి చతుష్షష్టికళలందు నేర్పరులైన గురువుల నేర్పరచి విద్య చెప్పించుచుండెను. ఆ రాజకుమారుడు శుక్లపక్షపు శశధరునిచందంబున దినదినప్రవర్ధమానుండై సకలవిద్యలంజదివి గురువులమెప్పునంది షోడశకళాపరిపూర్ణుడగు సుధాకరునిభంగి షోడశవత్సరప్రాయుండై నూత్నయౌవనవికాస

ముతో భాసిల్లుచు ధనుర్విద్యయందును వివిధసంగరక్రీడలందును నాటి రాజపుత్రులెవ్వ రితనికిసాటిగారనిపించుకొనుచు దినదినము రాజాస్థానమున కరుదెంచి రాచకార్యముల వీక్షించుచు యావరాజ్యపట్టాభిషేకమునకర్హుండై యుండెను. ఇట్లుండ నొకదినమున శిశుపాలుడు నిండుకొలువుండ నాతనిదండ శ్రుతకీర్తి వెంబడించియుండ నంబరుదేశమునుండి కొందరు చారులువచ్చి యిట్లు విన్నవించిరి. శిశుపాలభూమిపాలా! మే మంబరుదేశమహారాజు చారులము. మా భూపాలుని తనయయగు స్వయంప్రభాదేవికి తండ్రిగారు స్వయంవరము చాటించినారు. ఆ స్వయంప్రభ తన స్వయంవరమునకు రాజపుత్రులనుగాని, మరెవ్వరినిగాని మూడుప్రశ్నలడుగునట. ఆ మూటికి సదుత్తరములనుజెప్పినవాని నామె పెండ్లాడునట. లేనిచో వానిని తనకుం బరిచారకునిగ నుంచుకొని నిజోద్యానవలమందలి చెట్లకు దినమున కిన్నూరుఘటముల నీరు దోడించునట. ఈ సమాచార మన్నిదేశములవారికిని జెప్పవంతు మాకు వచ్చినది. అందులకై వచ్చితిమనిపలికి యా రాజుచే బహూకరింపబడి వెడలిపోయిరి. అత్తరుణమున శ్రుతకీర్తి యా పలుకులనన్నిటిని విని యింతదనుక నా స్వయంప్రభ యనూనవిలాసవతియని వినియుంటచే నామె యిచ్చుప్రశ్నలకు త్తరములిచ్చి పెండ్లాడవలెనను కుతూహలముకలిగెను. జననీజనకులతో జెప్పిన సమ్మతింపరనియొకనాటి యర్ధరాత్రమున నుత్తమహయాధిరూఢుండై యంబరుదేశమునకేగు మార్గమునుబట్టిపోయెను. వాసంతికా శిశుపాలుడు పుత్రునకై పలువిధంబుల విలపించి యన్వేషింప లాభములేనందున నూరకుండిరి.

శ్రుతకీర్తి కతిపయప్రయాణంబుల నంబరదేశముజేరి రాజాంతఃపురమునకు తానొక రాజపుత్రుండననియు, స్వయంప్రభప్రశ్నల కుత్తరముల జెప్పుదుననియు నామెను స్వయముగజూచి మాటలాడవలెననియు నందుల కనుజ్ఞయిమ్మనియు దెలుపుకొన వెంటనే రావలసినదని ప్రత్యు

త్తరమువచ్చెను. అతడు రాజాంతఃపురమున స్వయంప్రభయుండు భవనద్వారమును సమీపించువరకామె చెలికత్తె యెదురువచ్చి స్వయంప్రభయెదుటకుగొంపోయి యుచితాసనమున గూర్చుండజేసి ఫలహారమిడి గౌరవించెను. జగదేకసౌందర్యవతియగు స్వయంప్రభనుజూడగనే శ్రుతకీర్తిచిత్తము వికలమయ్యెను. అతడెట్లో చిత్తము సరిచేసికొని యామెంగాంచి, కన్యామణీ! నీవు స్వయంవరమునకు పణముగానొడ్డిన మూడుప్రశ్నలేమి? యన నామె, రాజపుత్రా! మొదటిప్రశ్న:— నా కడ నొకవజ్రమున్నది. దానిని నీకు జూపెదను. దానివంటిదే మరొక్కటుండును. దానిని తేవలయును. రెండవప్రశ్న:—వింధ్యనగరప్రాంతమున నొక స్నానశాలయున్నది. అది తనంతదాతిరుగుచుండునట. ఆ స్నానశాల యొక సౌధమునందున్నదట. దాని నిజచరిత్రమును దెలుపవలయును. ఈ రెండు ప్రశ్నలకును మూడు మాసములు గడువు. ఆ లోపల సమాధానములు చెప్పజాలవేని పదేండ్లు నా యుద్యానవనమున తోటమాలిపని చేయవలెను. మూడవప్రశ్న తరువాత జెప్పెదను. నా కడనున్న వజ్రమిదిగోయని దానిం జూపించెను. అతడా వజ్రమునుజూచి నిరాశాహతుడై, రాజకుమారీ! నీ ప్రశ్నల సాధింపజాలితినా యొక నెలదినములలో వత్తును. లేదా నీ రూపంబును స్మరించుచు నసువుల వీడుదుననెను. స్వయంప్రభ శ్రుతకీర్తిసౌందర్యమునకు ముగ్ధయై, ఆర్యా! మొదటనే నిరాశజెందనేల? యత్నించినచో మనుజున కసాధ్యమేది కలదు? అనగా నతడతిధైర్యముతో బయలుదేరి చాలదూరముగడచి యరణ్యంబులను నదులను దుర్గములను పర్వతములను పెక్కింటినిదాటి మార్గాయాసమున నొకచో నొకవృక్షచ్ఛాయను విశ్రమించెను. ఆ చెట్టుపై నొక మగపక్షియు నొక యాడుపక్షియునున్నవి. అవి దివ్యవిహంగమములు. అందులో నాడుపక్షి మగపక్షింగాంచి, నాథా! ఈ చెట్టునీడ విశ్రమించిన యాతడెవండు? అని ప్రశ్నింప నా మగపక్షి, అతడు సౌవీర యువరాజు. అంబరురాజపుత్రికప్రశ్నలకు సమాధానము

చెప్పుటకు బయలుదేరెను. ఆమె యొక వజ్రమితనికిజూపి యిట్టిదింకొకటి తెమ్మన్నది. దానికి సాధన మెఱుంగక విచారములోనున్నాము. అనగా నాడుపక్షి, ఈతడామెను గాఢముగవలచినాడు కాబోలు! లేనిచో నిన్ని కష్టములనందునా? ఆ వజ్ర మచ్చటనుండునో మీకు దెలియునా? ఉన్నచో దానిని తెచ్చు విధానమేది? అని యడుగ మగపక్షి, అంబా సముద్రతీరంబున చాలకాలముక్రిందట నొకజాతిపక్షులీ వజ్రములను గ్రుడ్లుగా బెట్టుచుండెడివి. అందొకటి స్వయంప్రభ ముత్తాతతండ్రికి దొరికినది. రెండవది తూర్పుసముద్రతీరముననున్న దీవిలోనున్నది. ఆ దీవి నెవ్వరు జొరకుండ రక్కసులు కావలియున్నారు. వారినిగడచి యా దీవిని జేరి దానింబాలించు సుమేరుమహారాజునుగాంచి తనకడనున్న వజ్రము నా రాజునకు జూపి దానివృత్తాంతము తెల్పిన నా రాజు తనవజ్రమును కూతురైన శారదనుయిచ్చి వివాహమొనరించును. మన తెక్కలోని యెఱ్ఱని వెండ్రుకలనుగాల్చి దానిబూడిద మేనికిరాసుకొన్న రాక్షసరూపియగును. తెల్లని వెంట్రుకలనుగాల్చిన బూడిదవ్రాసికొన్న స్వస్వరూపమునుదాల్చునని పలికి కొన్ని యెఱ్ఱనివి కొన్ని తెల్లనివి వెంట్రుకలను రాల్చెను.

శ్రుతకీర్తి పక్షిభాషయెఱుంగుట నా వెంట్రుకలనుదీసికొని మఱునాడు ప్రయాణమై చాలదూరముపోవ నచట పెద్దవెలుగు గన్పట్టెను. ఆ వెలుంగుజూచి యతడు వింతపడి, యటకుబోవ నొకసర్పము కనబడి నీ పేరేమనియడుగ శ్రుతకీర్తియని చెప్పెను. తోడనే యా సర్పము గంధర్వరూపమునొంది, మహాత్మా! నీ దర్శనమువలన నాకు శాపమోక్షమైనది. నేనందులకై నీ రాకకువేచి యిందుంటినని తన లోకమునకు గొంపోయి యాదరించెను. శ్రుతకీర్తి తావచ్చినపని తెలుప గంధర్వుడు నిజసేవకులనుబిలచి, ఇమ్మహాత్ము నొకడోలీలో గూర్చుండబెట్టికొని తూర్పుదీవిలో దిగవిడచి తిరిగివచ్చువరకందేయుండి మరల నిటకుగొని

తెంపన వారట్లు తూర్పుదీవికి పదునేనుదినములలోఁ జేర్చి తామొకచో నుండిరి. శ్రుతకీర్తి డోలీదిగి యొకపక్షి వెండ్రుకలగాల్చి దేహమునకు బూయ రక్కసుడయ్యెను. ఆ దీవిలోనిరక్కసు లితడు తమవాడేయని యూరకుండుటచే నిర్భయముగా శ్రుతకీర్తి దీవిమధ్యమునకుఁబోయి తెల్లని వెండ్రుకలనుగాల్చి శరీరమునకు బూసికొని నిజరూపమునుదాల్చి రాజమార్గమునఁబోవుచుండ రాజభటులు బంధించి సుమేరుమహారాజుకడకు గొంపోయిరి. ఆ రాజు శృతకీర్తిని గాంచి యతనివృత్తాంతమెఱింగి యతని కడనున్న వజ్రమునుజూచి తనకూతురు శారదనిచ్చి పెండ్లియొనర్చెను. కొలదిదినములట నుండి మరలవత్తునని సుమేరుమహారాజుతోఁ జెప్పి పయనమగుచుండ నీ వెక్కడికిఁబోయెదవని యడిగెను. అపుడు శ్రుతకీర్తి వింధ్యపర్వతప్రాంతమునకు కొండొకపనిమీఁదఁబోయెదననగానే యా రాజల్లునకు దన యాస్థానశిల్పిచే నొకకీలుగుఱ్ఱమును చేయించి యిచ్చెను.

శ్రుతకీర్తి యా కీలుగుఱ్ఱమెక్కి పోవుచుండ జటిలమహాముని యాశ్రమముపై నుండి పోవలసివచ్చెను. ఆ ముని మహాత్త్వమున కీలుగుఱ్ఱము కీళ్ళూడిపోగా నా ముని యాశ్రమప్రాంతమున భూమిపై బడి మూర్ఛిల్లెను మునిశిష్యుఁ డొక్కడదికాంచి శ్రుతకీర్తిని సేదదేర్చి గురునకావృత్తాంతమునుజెప్ప నతడు శృతకీర్తిని జేరబిలిచి, వత్సా ! ప్రపంచమంతయు మిథ్యయని తెలియు లేక నింకను కామమునే వాంఛించుచుంటివి. యౌవన మస్థిరము. కామక్రోధాద్యరిషడ్వర్గమును. వీడినవాడే ధన్యుడు.

శ్లో. మాకురు ధనజన యౌవనగర్వం, హరతినిమేషాత్కాలస్సర్వం,
మాయామయమిదమఖిలంహిత్వా, బ్రహ్మపదంత్వంప్రవిశవిదిత్వా.

పరబ్రహ్మపదవాచ్యుండగు విష్ణువును ధ్యానించుటే మనుజుని కర్తవ్యము.

శ్లో. త్వయిమయిచాన్యత్రైకోవిష్ణుః, వ్యర్థం కుప్యసి మయ్యసహిష్ణుః,
భవసమంచిత స్సర్వత్రతత్వం, వాంఛిత్యచిరాద్యది విష్ణుత్వం.

ఇట్లు పలికి తారకమంత్రముపదేశించి, నీకు శుభంబగు పోయి రమ్మన నతండు మునికడసెలవంది చాలదూరముపోయి యొక జనుల గుంపునుజూచెను. వారందరొక బావికడ నిలబడియుండిరి. ఎందుకు మీరిచ్చట నిలబడి విచారించుచున్నారనియడుగ నందున్న నొక దంపతులు, మా కుమారుడిం దురికివాడని పలికిరి. అంత శ్రుతకీర్తి, మీరు విచారింపకుడు. నేనుపోయి మీబిడ్డ క్షేమమరసివత్తునని యాబావి యందు కన్నులుమూసికొని దుమికెను. అందుండి యొకయుద్యానవనంబున తేలెను. అతడందుల కాశ్చర్యపడి విహరించుచుండ చక్కనిగానము వినంబడియెను. అంతలో కొందరు కాంతామణు లరుదెంచి రాజపుత్రుని జూచి తమరాణికడకు గొంపోయిరి. ఆమెప్రక్కసింహాసనమున నొక యువకుడు కూర్చుండియుండెను. శ్రుతకీర్తి యా యువకునిదిక్కు మొగంబై, నీవేనా బావిలో దూకినది. నీకొరకై నీ జననీజనకులు విచారించుచున్నారు రమ్మని పల్కి యా దేవకన్నెంజూచి, లలనామణీ! నీ కీతనిపై మక్కువయింతకలదేని యపుడపుడు పోవుచుండరాదాయని బ్రతిమాలి యామె నంగీకరింపజేసి యువకుని వెంటనిడుకొని నూతిపైకి వచ్చి యతనిని తలిదండ్రుల కప్పజెప్ప వారు శ్రుతకీర్తిని వేనోళ్ళబొగడిరి. శ్రుతకీర్తి వారినుండి సెలవుదీసికొని మరొకమార్గమునబడి కొన్ని దినంబులలో వింధ్యపర్వతారణ్యములను సమీపించి తిరుగుచుండ నొక వృద్ధుండగుపడెను. రాజపుత్రుం డతనిం గాంచి, ఆర్యా! ఈ ప్రాంతమున తనంతదానె తిరుగుస్నానశాల యెచ్చటనున్నదో మీకు తెలియునా? యన నా వృద్ధుండు, నాయనా! ఈ మార్గమున కొంతదూరమరిగితివా రెండుత్రోవలు కన్పట్టును. అందు కుడివైపునకుపోవు త్రోవను బోయితివేని యా స్నానశాలం జేరవచ్చునుగాని యదియొక వనరాజు నధీనమం

దుండి యెవ్వరును లోనికిబోయి చూడకుండ సైనికులచే కావలికాయ బడుచున్నదని వచించెను. శ్రుతకీర్తి యా వృద్ధునకు నమస్కరించి ముందునకు బోయెను. కొంతదూరమేగ మార్గద్వయము చూపట్టెను. అందు కుడిప్రక్కదారినిపోగా వనంబుననున్న స్నానశాలకడకు గొంపోయెను. అందున్న కావలివారు శ్రుతకీర్తినిచూచి వారించి వనరాజుకడకు జేకొనిపోవ శ్రుతకీర్తి తన వృత్తాంతమాద్యంతమా రాజునకు విన్నవించి తనకా స్నానశాల చూపుమనెను. అంత వనరాజు, ఆ స్నానశాలయంతయు మాయతో గూడియున్నది. అచ్చట కేగినవారు ప్రాణములతో తిరిగి రారు. నా మాట వినుమని బ్రతిమాలినను శ్రుతకీర్తివినక, మహాత్మా! చాలదూరము శ్రమనుపడివచ్చితిని. నా యత్నము సఫలమగుటలో మరణము ప్రాప్తించినను నా కానందమే. యన వనరాజు మారుమాటాడ లేక వానిం గావలిగాయు సైనికులకు స్నానశాల యితనింజూపనిమ్మని యొక లేఖనిచ్చి పంపెను.

శ్రుతకీర్తి యా లేఖం దీసికొని కావలివారికిజూపి వారి యనుమతిపై స్నానశాలలో బ్రవేశించెను. అదియొక దివ్యభవనము. అతడు కొంతదూరము పోగా యొక యెడారికనబడెను. అచట నొక పరిచారకుడు శ్రుతకీర్తి కెదురుపడ, 'స్నానశాలయేది' అని ప్రశ్నింప వాడతని నొకతొట్టిలో నిలువబెట్టగనే దానినిండ నీరునిండి శ్రుతకీర్తి కూపిరి సెలపలేదు. అంతలో పెద్దధ్వనియై స్నానశాల మాయమై యొక యెడారి కాన్పించెను. అందొక సౌధముండెను. దానిలోపలి కతడేగ నొక సౌధము—దానిలో నొక చిలుక—మూడు బాణములునుండి యా గోడపై నీచిలుకను మూడు బాణములతో గురిచూచి కొట్టినవారికి స్నానశాల రహస్యము తెలియును. గురితప్పి తగలనిచో నతడు శిలారూపి యగునని వ్రాయబడియుండెను. శ్రుతకీర్తి యందొక బాణమును దీసి దానితో చిలుకనుగొట్ట గురితప్పి మోకాలివఱకుశిలారూపమందెను.

తరువాత రెండవబాణమునేయ నదియు గురుతప్పి నడుమునకు శిల యయ్యెను. తానుతప్పక శిలారూపియగుటకంటె వేరులేదని మూడవబాణముతో గొట్టగురితప్పక గొప్పధ్వనియై యాసౌధము మాయమయ్యెను. ప్రకాశవంతమగు రత్న మొండు కాన్పించెను. ఆరత్నమే యాస్నానశాల రహస్యము. శ్రుతకీర్తి యారత్నమును గైకొని వనరాజునకు జూపి తిరిగి పంపెదనని పలికి యటనుండి సుమేరుదీవికివచ్చి తాబోయిన కార్యము సాధించితినని మామకుజెప్పి తన భార్య శారదను వెంటబెట్టుకొని బయలుదేరి గంధర్వసేవకుల గలసి గంధర్వలోకమునకువచ్చి గంధర్వుని గలిసికొని యతనిచే బహూకరింపబడి యంబరుదేశమున కేతెంచి స్వయంప్రభ ప్రశ్నలకు సమాధానముజెప్పి యామెతో, రాకుమారీ! నీవడిగిన రెండు ప్రశ్నలకు నుత్తరువు లిచ్చితిని. తక్కిన ప్రశ్నలం దెలుపు మనెను.

స్వయంప్రభ తన రెండు ప్రశ్నలకు నాతడు సమాధానములు చెప్పినందుల కబ్బురపడుచు, ఆర్యా! నా మూడవప్రశ్నమిది. 'పుణ్యమొనర్చి నదిలోవేయుమని యొకడు తనయింటిగోడపై వ్రాయించెను. ఆ పుణ్యమేమి? దాని ఫలితమేమి? ఆ యిల్లీ నగరమున కుత్తరముగా నున్నది! అని పలుక శ్రుతకీర్తి బయలుదేరి చాలదూరము నడువగా నప్పటికి సూర్యుడస్తమించి దశదిశల గాఢాంధకారము వ్యాపించెను. అప్పుటి కతడొక సాంద్రారణ్య మధ్యముననుండి యారాత్రికట విశ్రమింపనెంచి యొక మఱ్ఱిచెట్టుసీడను గూర్చుండెను. ఇంతలో నొక యార్తనాదము వినబడగా నదివచ్చుదిశకు కొంతదూర మరిగెను. అచ్చట నొక సుందరయువకుడు విచారవదనుడై కాన్పించి యితనిం జూడగనే మఱింత యేడ్వసాగెను. శ్రుతకీర్తి యువకునికడకేగి, నాయనా! నీవెందుల కేడ్చుచుంటివో తెలిపితివేని నాయోపినంత సాయ

మొనచ్చి నీదుఃఖమును చల్లార్చెదననెను. అంత నాయువకుడు, ఆర్యా! నేను వర్తకము సేయుటకు పలు దేశములను దిరుగుచు నొక నాడీ ప్రాంతమందున్న నగర రాజమార్గమునబడి నడచుచుండ నొక మేడపై యంతస్తున నిలువబడియున్న యొక యువతీమణిం గంటిని. ఆమె సౌంద ర్యమాకర్షించినది. అప్పుడు నే నావీధిని బోయెడి యొకనింజూచి యామె సమాచారమడుగ నాతడు, అయ్యా! ఆమెయొక ధనవంతుని కుమార్తె. పేరు నాగమణి. అవివాహిత. ఆమెను వివాహమాడదలచినవా రామె యడిగెడి మూడు ప్రశ్నలకు సమాధానములను జెప్పవలెనని చెప్పి తనదారిం బోయెను. నేను కొంచెమాలోచించి యామె సౌధద్వారమున నిలిచి యొక పరిచారికచే లోనికి వర్తమాన మంపితిని. ఆమె నన్ను లోనికిరా ననుజ్ఞయిచ్చినది. నేనా పరిచారిక వెంట లోనికేగి యామెను జూచినంతనే వివశుండనైతిని. ఎట్లో తెలివి తెచ్చుకొని, కన్యకామణీ! నీప్రశ్న లేమని యడిగితిని ?

నాగమణి నావైపునకు చుఱచుఱ జూచుచు నీవు నాప్రశ్నలకు సమాదానము,చెప్ప వచ్చితివా? అట్లయిన వినుము. (1) మొదటిప్రశ్న:— ఈపుర బాహ్యప్రదేశమందున్న పెద్దగోతి యందేమియున్నదో కను గొని రావలెను. (2) రెండవప్రశ్న:—సోమవారమునాటి రాత్రి, ఆ పని నేను చేయలేదే యని వినవచ్చును. దాని యర్థమేమి? (3) మూడవ ప్రశ్న:—దేవలోకమునందున్న సువర్ణలతను మణినిగొని రావలెను. అని చెప్పి దీనికి సమాధానములు చెప్పలేనిచో నీ భాగ్యమంతయు నా వశము చేయవలెను. ఆ ప్రశ్నల కుత్తరువులు చెప్పుట దుస్సాధ్య మని పిచ్చివానివలె దిరుగుచుండ నాగమణి పరిచారకులు నాకడనున్న ధనమంతయు లాగికొని పురబాహ్యప్రదేశమున విడచిపోయిరి. నాకా మెయందు మోహ మధికముకాగా మఱింత పిచ్చివాడనైతినని చెప్పెను. అపుడు శ్రుతకీర్తి కృష్ణకుమారుండను పేరుతోనొప్పు నా యువకునిగని,

ఓయీ! నన్నా నాగమణి చెంతకు గొనిపొమ్ము. ఆ ప్రశ్నలకు సమాధానములు చెప్పి నీ కామె రాంగిగ నుండునట్లు చేసెదను. అన వారిరువురు బయలుదేరి నగరములోని నాగమణియింటికి కరిగిరి. శ్రుతకీర్తి నాగమణినిగాంచి, ఎలనాగా! నే నితనికొరకు నీప్రశ్నలకు సమాధానము చెప్ప యత్నింప బోయెదను. నేవచ్చువరకీతనిని జాగరూకతతో జూడుమని చెప్పి నగర బాహ్యప్రదేశమందున్న గోతికడకరిగి, మహానుభావా! జటిలమహర్షి కరుణాపరతలభించిన తారకమంత్ర ప్రభావమున నాగమణి ప్రశ్నల మూటికిని సమాధాన మీయగలుగుదుం గాకయని యా గోతిలో నురికెను. అతడట్లెంతసేపు క్రిందకుదిగెనో యూహింపజాలడయ్యెను. రెండురాత్రులు గడచిన పిమ్మట మూడవనాటి సూర్యోదయకాలమున వెలుతురు చూచెను. ఇంతదూరము క్రిందకువచ్చి మరల పైకెట్లు పోదునని తలపోసి యందలి విశేషములను జూడనెంచి కొంత దూరము నడువ నొక యెడారియు దానికి కొంతదూరమున నొక సరోవరము గన్పట్టినవి. ఆ కొలనిలో నీరుద్రావి మరింత ముందునకేగ నొక ప్రహారీగోడద్వారము కన్పడెను. రాజపుత్రుడా ద్వారమున లోనికేగ వియత్పథమంటునంత మహోన్నతములైన సౌధరాజములతో నొప్పునగరంబు చూపట్టెను. కొందరు చిత్రరూపులగు దేవత లాతనిని చుట్టుముట్టి వీడు నరుడు. వీనిమాంసము భక్షింతమని యొకడన వేరొకడీ సంగతి మనరాజునకు దెలిసిన మనకు చావు తప్పదనెను.

శ్రుతకీర్తి వారిబారినుండి తప్పించుకొని కొంతదూరమేగ మరి కొందఱు దేవతలుకాన్పించి, వీడు మనుష్యుండు. మన రాజుకూతురు చాలకాలమునుండి వ్యాధిపీడితయై యున్నది. వైద్యులెందరో చికిత్స చేసినను లాభము లేకపోయినది. వీడేమైన చేయగలడేమో? మనకు బహుమానము లభించునని శ్రుతకీర్తిని తమ రాజుకడకు గొంపోవుచుండ మధ్యేమార్గమున నారాజునకు సామంతుడగు వజ్రపాలుడు కన

బడెను. అతనిభార్య నేత్రరోగ వ్యాధిగ్రముచే చాల బాధనొందు చుండెను. వజ్రపాలునికడ దేవతలు శృతకీర్తిని బెట్టి యితడు నరుడని చెప్పగా నావజ్రపాలుడు శ్రుతకీర్తిజూచి, నీకేమైన వైద్యము తెలియునా ? నాభార్య నేత్రరోగ వ్యాధిరోగములచే చాలకాలమునుండి బాధనందుచు కృశించిపోయినది. ఆ రోగములను కుదిర్చితివా నీ కాజన్మాంతము కృతజ్ఞుడనై యుందునని వేడుకొనెను. అంత శ్రుతకీర్తి, ఆర్యా! మీయర్ధాంగికి రోగనివృత్తి చేయగలను. మీప్రభువుకూతురు వ్యాధిగ్రస్తగా నున్నదట. ఆమెకు కూడ చికిత్సనొనరింతును. వారికి నారాక తెలియజేయుడని వజ్రపాలుడట్లే చేసెదననెను. అపుడు శృతకీర్తి తనకడనున్న మణి నరుగదీసి వజ్రపాలుని భార్య నేత్రములకు కలికము పెట్టి నీరు లోనికి ద్రావించెను. ఇట్లు మూర్మారుచేయ నామె కన్నులు విప్పిచూచెను. వజ్రపాలుండంత శ్రుతకీర్తిని పలువిధంబుల కొనియాడి యనేక బహుమానములిచ్చి తన ప్రభువుకడకు గొంపోయి యతని వైద్యప్రభావము నెఱిగించెను. అంత నాదేవల రాజగు సూర్యజిత్తు శ్రుతకీర్తింగాంచి, ఆర్యా ! నాతనయ యేదో వ్యాధిచే బాధనొందుచున్నది. గొప్పగొప్ప వైద్యులు చికిత్సచేసి పెదవి విఱచి విడచిరి. నాకు చాలకాలమునుండి కడుపునొప్పి రోగమున్నది. దయయుంచి చికిత్సచేసి రోగవిముక్తులం జేయుడని వేడెను.

అంత శృతకీర్తి, ప్రభూ ! తామనుదినము భుజించునపు డొంటరిగ భుజింతురా ? లేకపదిమందితోగలసి భుజింతురాయనియడుగ, పదిమందితోగలసి యేభుజింతునని సమాధానమిచ్చెను. నేటిరాత్రిభోజనసమయమున భోజనశాలకునన్ను గొనిపొండని శ్రుతకీర్తిపలికి సూర్యజిత్తునితో రాత్రిభోజనశాలకరిగెను. బందుగులు, మిత్రులు మొదలగువారుపంక్తికి గూర్చుండిరి. వడ్డనజరిగెను. సూర్యజిత్తునకొక బంగారుపాత్రలో భోజనమమర్పబడెను. శ్రుతకీర్తి కాతనిప్రక్క వెండిపళ్ళెరములో నమర్పబడెను. భోజన మారంభించుటకు ముందు శృతకీర్తి సూర్యజిత్తు భోజన

పాత్రను గప్పితీసెను. అది యంతయు క్రిమికీటకములతో నిండియుం డెను. శృతకీర్తి, అయ్యా! చూచితిరా! దృష్టిదోషమువలన నట్టిరసవత్పదార్థము లెట్లయినవో! రేపటినుండి మీరు వేరుగా భుజింపుడు. మీకు కడుపునొప్పిబాధ యుండదని చెప్పెను. సూర్యజిత్తు నట్లే యేకాంతముగ భుజింప నా బాధ మరల కలుగలేదు. పిమ్మట సూర్యజిత్తు శృతకీర్తిని తన కుమారైకడకు గొంపోయి చూపెను. శృతకీర్తి తన మంత్రిని నీటితో నరుగదీసి యాజాయమును దాగ్రివించెను. వెంటనే యామెకు వనునములయ్యెను. అంతటినుండి క్రమముగా నామెలోని యథాప్రకారముగ నవలావణ్యముంతో దరుగజొచ్చెను. సూర్యజిత్తు మిగులసంతసి చి వజ్రవైఢూర్యాది ననహస్రాసుల నొసంగి శృతకీర్తిని కొనియాడెను.

పిదప సూర్యజిత్తుకడ సెలవంది నాగమణిపురముజేరి మొదటి ప్రశ్నకు సమాధానముగా తాను జూచినదంతయుజెప్పి తన స్నేహితుడగు కృష్ణకు నూరునితో రెండవ ప్రశ్నకు సమాధానము దెత్తునని పల్కి మఱునాటి ప్రాతఃకాలమున నా నగరమునుండి పశ్చిమదిశగా చాల దూరము నడచి యొక మహారణ్యమును జేరెను. అప్పటికి భాను రపరాద్రిని గ్రుంకెను. గాఢాంధకారమున నడచి కొంతదూర మేగునరికి 'నేనా పని చేయలేదే' అను వచనములు వినంబడెను. ఆ ధ్వని వినబడిన దిశకతముపోగ నొక గ్రామము కన్పట్టెను. శ్రుతకీర్తి యొకగృహాంగణమున నాగెను. ఆయింటిలోవారందరును నలుదిశలు గ్రమ్మ గునట్లేడ్చుచుండిరి. శ్రుతకీర్తి యందొకనిం బిలిచి యిందరొక్క పెట్టున నేడ్చుటకు హేతువేమని యడుగ అంతవాడు అయ్యా! నీవిప్పూటికినూతనుండవుకాబోలు. ఈగ్రామమునకు నాలుగు దినములకొకమారొక రక్కసివచ్చును. అపుడువంతుప్రకార మీయూరిలోని యువకుడొకడామెకాహారము కావలెను. నేడీయింటివారివంతు వచ్చినది. ఒక్కడే కుమారుడు. వానిని విడువలేక యేడ్చుచున్నారని చెప్పెను. అపుడు శుృతకీర్తి, అయ్యా! వారి విచా

రము మాన్పింపుడు. ఆ రక్కసి నాలుగు రోజులకుకదా వచ్చును. ఏమియు భయములేదు. మీ పుత్రునకు బదులుగా నేపోయెదనని యారక్కసి వచ్చుమార్గమున నొక పెద్దయద్ద మమర్చి మాటున దాగియుండెను. అంతలో రక్కసివచ్చి యా దర్పణమందున్న తన ప్రతి రూపమునుజూచి, ఓహో! నా యాహారముండినుటకు నీవు వచ్చితివా యని పండ్లుకొఱుకుచు నూపిరిబిగబట్టి కడుపువగిలి చచ్చెను. శృతకీర్తి యా గ్రామవాసుల కాభూతముంజూపి వారిమన్ననలంది యటనుండి బయలుదేరి యొక మైదానమున బోవుచుండెను. అల్లంత దూరమున నొక మందిర మాతనికి గన్పట్టెను. అందు పరిశుభ్రవసనధారులు పదుగురును వారివెనుక మలినవస్త్రధారియు గూర్చుండిరి. ఆ మలినవసన ధారి విచారవదనుడై నే నాపని చేయలేదనుచుండెను. దైవ మాయవ లన నాపదునొకండుగురకు భోజనములు సిద్ధమయ్యెను. వారు శ్రుతకీర్తినిజూచి స్వాగతంబిచ్చిరి. అతడు వారినిజూచి, అయ్యా! మీరందఱు పరిశుభ్ర వస్త్రములనుగట్టి రసవంతములైన పదార్థములను భుజింపు చుండ నతడేల మాసినబట్టలుకట్టి మలినాన్నము దినుచున్నాడేల యని యడుగ నామలిన వసనధారి శృతకీర్తినిజేరి, ఆర్యా! నాపేరు జగత్సిం హుడు. మేమందరము సువర్ణపుర వాసులము. వీరు పదుగురు నామి త్రులు. నిరతాన్నదాతలు. దానధర్మశీలురు. నేను పరమ లోభిని. ధర్మమునన దెన్నడు చేయలేదు, పిల్లికి బిచ్చమిడలేదు మీరాదు మిక్కిలి దానధర్మములుచేసి ధనవ్యయము చేయవలదని వీరిని హెచ్చరించు వాడను మేమందర మొకప్పుడు కాశీయాత్రకు బోవుచుంటిమి. మమ్ము లను దారిలో దొంగలు దోచుకొని చంపిరి. వారు నిరతాన్న ప్రదా తలు ధర్మపరులు గాన పరిశుభ్ర వసనములతో మంచియన్నమును దిను చున్నారు. నేను పరమలోభినగుట గతిలేకయిట్లున్నాను. నాయందు కృపాతరంగుండవై సువర్ణపురమున కరిగి నాపెరటిలోని మఱ్ఱిచెట్టుక్రింద

నున్న ధనరాశిని దీయించి సగము నాపుత్రులకిచ్చి తక్కిన సగమును దానధర్మములు చేయింపుము. నాకపుడు సద్గతి కలుగునని ప్రతి మాలెను.

శృతకీర్తి యటనుండి వచ్చుచు కాంభోజదేశమునకు బోవ నా నగర ద్వారమందున్న రాజభటులు శృతకీర్తినిపట్టి యా రాజపుత్రిక సౌధముకడ నిలబెట్టి, అయ్యా! ఈ నగరమున కెవరువచ్చినను మా రాజపుత్రి కొన్ని ప్రశ్నల నడుగును. వానికి సమాధాన మిచ్చిన వారి నామె పెండ్లాడును. లేనిచో నామెకు వారు పాదాక్రాంతులై యుండ వలెను. ఆమె రాత్రిగాని మాటాడదు. అపుడామె దర్శనమునకు గొంపోదుమని రాత్రి కాగానే రాజపుత్రిక కడకు రాజభటులు శృతకీర్తిని చేకొనిపోవ నామె యతనిం జూఱ జూఱ జూచుచు నా ప్రశ్నలకు సమాధానములు చెప్పెదవా? నాకు లోబడి యుండెదవా యని యడిగినది. శ్రుతకీర్తి నీ ప్రశ్నలకు సమాధానము చెప్పుటకే వచ్చితిననెను. అంత నామె యట్లయిన వినుము.

(1) మొదటి ప్రశ్న:—స్త్రీ పురుషులకు లోకములో నిష్టముంగూర్చు ఫలమేది?

సమాధానము:—సంతానము.

(2) రెండవప్రశ్న:—ప్రాణికోటి కంతకును తప్పనిదేది?

సమాధానము:—మరణము.

ఆ సమాధానముల నాలకించి రాజపుత్రిక మూర్ఛిల్లెను. అపుడామె నాసికాగంధ్రమునుండి యొకసర్ప మీవలకువచ్చి శృతకీర్తిని బంధించెను. ఆ నాగ మంత గంధర్వరూపముందాల్చి వెడలిపోయెను. పిదప కాంభోజదేశాధిపతి తన తనయను శృతకీర్తికిచ్చి పరిణయమొన

ర్చెను. అతడు వివాహానంతరము కొలదిదినంబులటనుండి మరలవచ్చి దనని సువర్ణపురమునకేగి జగత్సింహు నిల్లుగురించి యతని కుమారులకు తండ్రిసమాచారమును దెలియజేసి పెరటిలోని మర్రిచెట్టుక్రింద నున్న ధనరాశి త్రవ్వించి సగము జగత్సింహునికొడుకులకిచ్చి మిక్కిన సగభాగము దానధర్మములకు వినియోగించి సోమవారమునాటిరాత్రికి జగత్సింహుడు తనకు గోచరించిన తావున కరిగెను. అప్పటికి జగత్సింహుడు తనవారివలెనే పరిశుభ్రవసనములనుగట్టి మంచియన్నమును దినుచుండెను. అతడు శ్రుతకీర్తి నెంతోకొనియాడెను. శ్రుతకీర్తి యారాత్రి జగత్సింహునితోగడపి వేకువనే పయనమై వచ్చుచుండెను. దారిలో నతనికొక వృద్ధాంగన కానుపించి నే పేదరాలిని నేమైననిమ్మని యాచించెను. అతడు తనవ్రేలియుంగరమీయ నది యానందించునట్లు నటించుచు నిన్ను పరమేశ్వరుడు రక్షించుగాకయని బిగ్గరగాబలికెను. అంతలో దొంగలేడ్గురువచ్చి శ్రుతకీర్తి నొకపాడునూతిలో ద్రోసి పోయిరి. జలములేని యా నూతిలో నతడారాత్రిగడపెను. మరునాడిరువురుబాటసారు లతని యాక్రందనము విని బయటకుదీసి పోయిరి. మరల నా దొంగలతనికి గాన్పింప మరీపాపప్రవృత్తి నేలచేతురు? ఇకనైన మానుడని వారికి గొంతధనమిచ్చి యటనుండి నాగమణినగరమునకువచ్చి సోమవారమునాటిరాత్రి వినుపించుధ్వనికి కారణము నెరిగించెను.

మరునాడు దేవలోకములోని మణినిదెచ్చుటకై యాతడు బయలుదేరి యనేకపర్వతములను, గిరికందరములను, మహారణ్యములను నదీనదంబులను దాటి దేవరాజ్యము చేరుటకు నాగమణినగరమునకు బాహ్యప్రదేశముననున్న గోయిలోనురికెను. అట తనకందరును పరిచయులేయగుట నాదరముతోను మాటలాడుచు తిన్నగా సూర్యజిత్తునికడ కరిగెను. అతడు శ్రుతకీర్తిని గౌరవించెను. శ్రుతకీర్తి తాను వచ్చిన

కార్యమును దెలుప సూర్యజిత్తు, ఆ లోకపాలకుడు మహానందుండనియు అతి డంతిపురినుండి యీవలకు రాడనియు నతని భటులు బహుకూరు లనియు దెలిపెను. అంత శ్రుతకీర్తి, ఆర్యా! ఆ కార్య మెంతదుస్సాధ్యమైనను నే జేయకతప్పదు. నేనా లోకమునకుబోవుటకు మార్గమెరిగింపుమన నతడు తనభటులగొందరను శ్రుతకీర్తికి దోడిచ్చి పంపెను. అతడా భటులతో నాలోకమును ప్రవేశించెను. అపుడు సూర్యజిత్తు సేవకులు, ఇంక ముందునకు మేమురాము. ఇట మీరు వచ్చువరకు వేచి యుందుమని చెప్పిరి. శ్రుతకీర్తి ముందునకుపోగా దేవతలడ్డి తిన్నగా నొకడు మహానందునికడకరిగి, దేవా! ఎవడో యొక మానవుడు దేవర దర్శింపగోరుచున్నా డేమి శెలవనియడుగ నా దేవరాజు వెంటనే కొనిరం డని యానతిచ్చెను. ఆ దేవతలు శ్రుతకీర్తిని గొంపోవుచుండ చింతామణియను వేశ్య యతని నెత్తుకొనిపోయెను. ఆ సమాచారము రాజునకు దెలుప మనరాజ్యమంతయు గాలించియైన వానిం దేవలెనని కఠినముగా నాజ్ఞయిడెను. వారు రాజ్యమంతయు వెదకి చింతామణీ శ్రుతకీర్తులను బంధించి తెచ్చిరి. దేవరాజు శ్రుతకీర్తిని గౌరవించి చింతామణిని మందలించివిడచి, ఆర్యా! మానవుండవగు నిన్నుజూచి మహదానందమందితిని. నా పుత్రుడు క టరోగముతో బాధనందుచున్నాడు. మీ లోకమున వైద్యులున్నారాయని శ్రుతకీర్తినడుగ నతండు, ప్రభూ! ఆ మాత్రముచికిత్స నే చేయగలను. మీ పుత్రునిటుగొనిరండన దేవరాజు తన కుమారుని శ్రుతకీర్తియెదుటకు దెప్పించెను. అతడు తనకడనున్న మణిని నీటిలోనరుగదీసి యా కుమారునికంటికి కలికము వేయ నా బాలుడు కన్నులందెరచి స్పష్టముగా చూడగలిగెను. మహానందుడు మహదానందమంది, నీకేమికావలయునో కోరుమనెను. నాకు తమకడ నున్న మణినిప్పించవలెనని శ్రుతకీర్తికోరగా మహానందుడు, ఆర్యా! ఆ మణి నెందులకడిగితివో నాకు దెలియును. నాగమణికొరకడిగితివి.

అట్లే యిత్తునుగాని యామెకుజేరినవెంటనే తిరిగి నా కడకు దెప్పించుకొందునని చెప్పి మణితో ననేకములైన కాన్కలిచ్చి సాగనంపెను.

శ్రుతకీర్తి వానిండీసికొని గోతినుండి యావలకువచ్చి మణిని నాగమణికిచ్చి యామెను కృష్ణకుమారున కుద్వాహముసేయించి ముందునకుపోగా నొకగోడమీద పుణ్యమొనర్చి నదిలోవేయుమని వ్రాయబడియున్నది. దానింజూచి యతఁడా భవనములోనికేగి యందున్నవృద్ధునింగాంచి, గోడమీదవ్రాయబడిన దానికర్థమేమని ప్రశ్నించెను. అంత నా వృద్ధుండు, అయ్యా! నేను యౌవనదశలో మదోన్మత్తుండనై కన్నులుగానక బందిపోటుదొంగనై యుంటిని. ఆ మహాపాపము నన్నంటకుండుటకై యిపుడనుదినమును రొట్టెలందెచ్చి నదిలో వేయుచుంటిని. వాటిని చేపలు కడుపారదినుచుండెను. నాటినుండి భగవద్భక్తుడనై కాలముగడుపుచుంటి నదియే యా గోడమీదవ్రాత కర్థమని తెలిపెను. శృతకీర్తి దానిని గ్రహించి యంబరురాజపుత్రికయగు స్వయంప్రభకడకరిగి యామె మూడవప్రశ్నకు సమాధానమునుజెప్పి యామెను పరిణయంబై యటనుండి తనభార్యలందఱితోను సౌవీరదేశమునకేగి జననీజనకులకును బంధుగులకును ప్రజలకును మహాసంతోషమును గలుగజేసెను. శింశుపాలమహారాజు తనపుత్రునకు రాజ్యాభిషేకమొనరించి వానప్రస్థాశ్రమము స్వీకరించెను. శృతకీర్తి ప్రజానురంజకముగ రాజ్యపాలనమొనర్చుచుండెను.

అని శ్రీకృష్ణుండు కథ ముగించువరకు తెల్లవారుటయు నిరువురును యమునానదికిబోయి స్నానమాచరించిరి.

---

## ఖాండవదహనము.

పాండునందన వసుదేవనందనులు యమునానదిని జలకమాడి వచ్చుచుండ వారికొక బ్రాహ్మణుడెదురయ్యెను. వారతనిని గౌరవించి యేమికావలెనని యడిగిరి. నాకొక కోర్కెకలదు. దానిం దీర్పవలెను. అది తెల్పినపిమ్మట నసాధ్యమనరాదనెను అర్జునుం డట్లెన్నటికిగాదు. తమకోరిక నివేదింపుడన నా బ్రాహ్మణు డగ్నిరూపుడై నిలచి, మహామహులారా! నేను పావకుండను. తొల్లి శ్వేతపాలభూపాలుం డొనర్చిన యాగమందు ఘృతధార యధికమగుట నా కగ్నిమాంద్య వ్యాధి కలిగినది. ఖాండవవనదహనమునగాని యది నివృత్తికాదు. నా యందు కరుణించి యీ వనమును దహింపవేడెదనని ప్రార్థించెను.

ఆ ధనంజయునికోర్కె దీర్పనెంచి వాసుదేవార్జునులు మీ కోర్కె నిప్పుడేతీర్తుమని పావకున కభయహస్తమిచ్చిరి. అనలుండప్పు డర్జునునకు మిగులతేజస్సంపన్నంబులగు నక్షయతూణీరములను శ్రీకృష్ణునకు గదాచక్రంబులును యిచ్చెను. అంత వారిరువురును పావకుని పూజించిరి అపుడగ్ని ఖాండవవనము నలుదిశల తనజ్వాలలనురగుల్కొలిపెను. అవ్వనపాలకులగు దేవతలా సమాచారమును సత్వరముగబోయి యింద్రునకుదెలుప నతండు సైన్యసమేతుండై వచ్చి యుద్ధమునకు గడంగెను. ఆ యుద్ధము త్రిలోకభీషణాకృతిదాల్చెను. ఆ రణమం దర్జునుడే విజయమందెను. ఇంద్రు డర్జునునితో సఖ్యపడి యతనికి దివ్యాస్త్రముల నిచ్చి దేవలోకమునకేగెను శ్రీకృష్ణార్జును లగ్నిదేవుని పొగడ్తలంది యింద్రప్రస్థమునకుంజని ధర్మరాజాదుల మన్ననలందిరి. పిదప వాసుదేవుండు ద్వారకకుజేరెను.

సంపూర్ణము

---

శ్రీ సత్యానంద ప్రెస్, రాజమండ్రి.

# మైలవరం కంపెనీవారిచేతను

## తదితరులచేతను ప్రదర్శింపబడు స్టేజి నాటకములు.

—:8:—

| | రూ. | అ. |
|---|---|---|
| కనకతార చం. శే. | 1 | 4 |
| సత్యహరిశ్చంద్రీయం బ. ల. | 1 | 8 |
| బుద్ధిమతీవిలాసము ,, | 1 | 4 |
| శ్రీకృష్ణతులాభారం ము. | 1 | 8 |
| కృష్ణలీల బళ్లారి వం. శే. సు. | 1 | 4 |
| లవకుశ డిటో | 1 | 4 |
| భక్తకుచేల డిటో | 1 | 4 |
| చూడామణి పా. ల. | 1 | 4 |
| పాండవవిజయం తి. వెం. | 1 | 8 |
| పాండవోద్యోగము అను శ్రీకృష్ణరాయభారం | 1 | 8 |
| పాండవాశ్వమేధం | 1 | 0 |
| జయంతిజయపాల ఆ. స. | 1 | 0 |
| కాలేజీగరల్ కా. హ. | 1 | 0 |
| రంగూన్ రౌడీ సో. రా. | 1 | 8 |
| ధరణికోట డిటో | 1 | 4 |
| వేణీసంహారము వ. సు. | 1 | 4 |
| రామదాసు బళ్ళారి డి. గో. | 1 | 4 |
| బొబ్బిలియుద్ధం శ్రీ. కృ. | 1 | 0 |
| పాదుకాపట్టాభిషేకం పా. ల. | 1 | 8 |
| విప్రనారాయణ డిటో | 1 | 8 |
| రాధాకృష్ణ డిటో | 0 | 12 |
| చిత్రనళీయం బళ్ళారి డి. కృ. | 1 | 12 |
| సాదసారంగధర డిటో | 1 | 12 |
| ప్రహ్లాద డిటో | 1 | 4 |
| రోషనార కో. సు. | 1 | 0 |
| సావిత్రి (మైలవరం) | 1 | 4 |
| ద్రౌపది (మైలవరం) | 1 | 8 |
| తులసీదేవి ము. వెం. | 1 | 4 |
| మహాకవి కాళిదాసు వా. | 1 | 0 |
| గయోపాఖ్యానం చి. ల. | 1 | 0 |
| ప్రసన్నయాదవము డిటో | 0 | 12 |
| పారిజాతాపహరణం డిటో | 0 | 12 |
| చింతామణి కా. నా. | 1 | 8 |
| పద్మవ్యూహం కా. నా. | 1 | 4 |
| మధుసేవ డిటో | 1 | 8 |
| చిత్రాభ్యుదయం డిటో | 1 | 8 |
| నరపతిగ్రియం డిటో | 1 | 8 |
| కన్యాశుల్కము గు. అ. | 1 | 8 |
| [illegible] క. వి. | 1 | 0 |
| అనసూయ సో. అ. | 1 | 4 |
| కంఠాభరణం పా. ల. | 1 | 4 |
| మోహనరన్ బి. ఏ. యం.సూ. | 1 | 4 |
| ఎక్స్ కాలేజీగరల్ | 1 | 0 |

వలయువారు :— చంద్రయ్య అండ్ కో.,

పబ్లిషర్సు అండు బుక్సెల్లర్సు, రాజమండ్రి.

